త్వరపడండి !                                                    సొంతం చేసుకోండి ! !

# శ్రీవాణి శత సంచిక ప్రత్యేక సంచిక

**ఏప్రియల్ '93 లో సుమారు 200 పేజీలతో వెలువడుతుంది.**

ఈ ప్రత్యేక సంచికలో అనేకమంది ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్య, విజ్ఞాన వ్యాసములు, కవితలు, పద్యములు, పురాణ ఇతిహాస కథలు. ప్రశ్నలు-సమాధానములు, వింతలు-విడ్డూరాలు, మీకు తెలుసా?, ఆణిముత్యాలు, నీతిసూక్తులు. ఇంకా...ఇంకా... ఎన్నో...ఎన్నో...విజ్ఞాన విశేషాలుంటాయి.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ప్రసంగాలు, సందేశాలు, ఆధ్యాత్మిక ప్రబోధలు వారి మహిమాన్విత దివ్యశక్తిని గురించిన వ్యాసములుంటాయి.

**విడి ప్రతి : రు. 15-00**

చందాలు అమలులో ఉన్న వారికి క్రొత్త చందాదారులుగా వెంటనే చేరేవారికి పై ప్రత్యేక సంచిక పంపబడుతుంది. అదనంగా ఏమాత్రం చెల్లించనవసరంలేదు చందాలు రెన్యూవల్ చేయని వారికి, బకాయిలు ఉన్నవారికి పై ప్రత్యేక సంచిక పంపబడదు.5-3-1993 కల్లా చందాలు పంపిన వారికే ప్రత్యేక సంచికలు పంపబడును.

పారిశ్రామిక వేత్తలు, వ్యాపారస్థులు తమ ప్రకటనలు (Advertisements) పంపి సహకరించ ప్రార్థన.

11-4-1993 ఆదివారం సా॥ 6గం. మచిలీపట్నంలోని ఆదర్శ విద్యాలయంలో 'శత సంచిక మహోత్సవం' జరుగును. కాన యావన్మంది పాల్గొన ప్రార్థన.

## చందాల వివరాలు

సం. చందా : రు. 48-00

4 సం. చందా : రు. 175-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

( జీవిత సభ్యుల ఫొటోలు ప్రత్యేక సంచికలో ముద్రించబడుతాయి )

పోషకులు : రు. 1116-00

1) ప్రతి నెలా శ్రీవాణి పంపటమే గాక శ్రీవాణి ముద్రించిన పుస్తకాలు కూడా ఉచితంగా పంపబడుతాయి.

1. వివేకవాణి, 2. రామాయణపాత్రలు, 3. అమృతవాణి, 4 కనీస విజ్ఞానం

పోషకులకు వెంటనే పుస్తకాలు పంపబడుతాయి.

గమనిక : చెక్కులు అంగీకరించబడవు. M.O. లేక D D.ద్వారా చందాలుపంపవలెను

## ప్రకటనలు *(Advertisements)*

Back Cover (4th Page) Multi Colours — Rs. 5000-00

Second & Third Cover (Black & white) — Rs. 3000-00

Opening page(Deluxe) — Rs. 3000-00

Full page (Deluxe) — Rs. 2000-00

Full page (Ordinory) — Rs. 1000-00

Half page ( ,, ) — Rs. 500-00

N. B. : Cheques & Drafts should be drawn in favour of 'SREE VANI, Monthly, Machilipatnam

ఫిబ్రవరి 1993

సంపుటి : 9

సంచిక : 2

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి క్రిష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 4-00 |
| సంవత్సర చందా | : రు. | 48-00 |
| 4 సం॥ల చందా | : రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 600-00 |
| పోషకులు | : రు. | 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM


## విషయ సూచిక



ముఖచిత్రం : సూర్య భగవానుడు

# తత్త్వజ్ఞానం — శివలింగం

'శాంతిమూ లేక సౌఖ్యమూ లేదు' ద్వంద్వ ప్రవృత్తిని అధిగమిస్తేనే సమబుద్ధి సాధ్యం. సమబుద్ధి సాధించినపుడు సర్వ మానవ సంక్షేమంకోసం సేవ చేస్తాడు

"శాంతా మహాంతో లోకహితం చరన్తః" శాంతిని సాధించిన మహనీయులు లోక సంక్షేమం కోసం కర్మ చేస్తారని శంకరుడన్నాడు ఆత్మదర్శనం చేసినవాడు సర్వభూతాత్మను దర్శిస్తాడు. ఇతరులకు హానిచేస్తే తనకు తాను కీడు చేసినట్లు భావిస్తాడు. మంచి చేస్తే తనకు మంచి. అటువంటి వానికి శత్రువు లేడు. సమానతలోనే ఏకత్వబోధ. విస్వార్థం. 'సర్వభూత హితం' అద్వైత సిద్ధాంతానికి ఆధారం. ఛిన్నద్వైధుడు, సమబుద్ధుడు ఎటువంటి సామాజిక రాజకీయ సిద్ధాంతాన్ని అంగీకరించడు. అటువంటి సిద్ధాంతాలు అన్యాయానికి, అసమానతకు, పుట్టుకనుబట్టి, సంపదను లేదా అధికారాన్నిబట్టి స్థానమివ్వవచ్చు. మాటలో చేతలో అద్వైతం సమత్వం కలసివుంటాయి. అద్వైతం భావంలోనేగాని క్రియరూపం యివ్వడం కష్టం అనడం అవివేకం, తర్కరహితం. అభేదం, సమత్వం దర్శించిన వాడికి దర్శనవర్తన ఒకటే. అభినవ విద్యాతీర్థ మహాస్వామి – అన్యాయాన్ని మూర్ఖత్వాన్ని, అంధ విశ్వాసాన్ని ప్రబోధించే సంప్రదాయాల్ని విడిచిపెట్టమన్నాడు. కులం గోడలు పగులగొట్టమన్నాడు అమనీత్వం, అద్వేష్టిత్వం అనేవి బ్రహ్మజ్ఞానానికి సాధనలన్నాడు సురేశ్వరుడు. కామసంకల్ప వర్జితుడు కాకపోతే యథేష్టాచరణ వెంటాడుతుంది

"సర్వం ఫలం గేహపతి ద్రుమాశ్రయం" అద్వైతవేదాంతంలో కర్మకు జ్ఞానానికివున్న సంబంధం గురించి ఆధునిక పండితులు చర్చించారు. 'అహం బ్రహ్మాస్మి' అనే తలంపుకు అడ్డురానంతవరకు ఏ పని అయినా చేయవచ్చు దృఢ బోధవుంటే కవిత్వం చరిత్ర పఠించవచ్చు. తర్కం బోధించవచ్చు. వ్యవసాయం చేయవచ్చు లౌకిక వ్యవహారం బ్రహ్మజ్ఞానానికి విరోధం కాదు సత్యదార్శనికుడు కార్యక్రమాల్లో పాల్గొనవచ్చు. మాయామయ జగత్తును సత్యంగా గుర్తించాల్సిన అవసరంలేదు. వ్యక్తి చైతన్యుడు.

బ్రహ్మజ్ఞానం పొందినవాడు కూడా లౌకిక వ్యవహారాల్లో పాల్గొని సేవ చేయవచ్చు ప్రవర్తతం సుఖేనయాం బుద్ధుడు జ్ఞానోదయం అయిన తరువాత లోక సేవ చేశాడు. చేయవచ్చు, చేయకపోవచ్చు. కర్మాణి కరోతు మా కార్షోతు సమాధిస్థితిలో అతని కర్మలు నశిస్తాయి వాసనారహితుడు, ఆలోచనారహితుడైన వాడికి కర్మతో, జపంతో పొందవలసింది లేదు. ఆత్మకు ఏవీ లేవని మనం కల్పించుకున్నవని చెప్పారు. మనీషాపంచకంలో శంకరుడు. అన్నిటికీ అతీతంగా తక్కువ కులంలో పుట్టినా అద్వైత జ్ఞాని అయితే గురువుగా భావించగలిగాడు

నిర్గుణ పరబ్రహ్మతత్త్వాన్ని ఏనాడో ప్రతిపాదించి భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రతిపాదించింది అద్వైతం.

" నేను మనిషిని దేవుణ్ణి యక్షుణ్ణి కాను. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రుణ్ని కాను బ్రహ్మచారిని, గృహస్థుడను, వానప్రస్థుణ్ని కాను. నేను నిజబోధ రూపుణ్ని అన్నాడు హస్తామలకుడు.

తత్త్వజ్ఞానం పొందినవారు ఎలా వుంటారంటే సమాధానాలు ఉపనిషత్తు గీతలలో కనుపిస్తున్నాయి.

బృహదారణ్యకం (10-4-23), గీత (2-55-72; 12-13-20) ల్లో సాక్షాత్కారం పొందినవాడి జీవన విధానం ప్రవర్తనను గురించి విపులంగా తెలియచేశారు. ఆ వెలుగులో మనం పరిశీలిస్తే జ్ఞాని అవునో కాదో తెలుసుకోగలం.

# మానవజాతి ప్రత్యక్ష దైవం - సూర్యుడు

కొమరగిరి జయప్రద

" ఆదిదేవ నమస్తుభ్యం
ప్రసీద మమ భాస్కర
దివాకార నమస్తుభ్యం
ప్రభాకర నమోస్తుతే "

కాలము భగవత్స్వరూపము కాలం అనంతము. ఆదిమధ్యాంతరహితము. ఈ అనంతమయిన కాలచక్ర భ్రమణంలో మానవుడు సుఖసంతోషాలతో జీవించాలంటే, దైవ ప్రీతి, పాపభీతి, సంఘ నీతి, ఎంతో అవసరం ప్రతి మనిషి ఎంతోకొంత దైవ చింతన చేయగలిగితేనే సుఖంగా జీవించగలుగుతాడు. ఈ దైవ చింతన అనగానే ఏ దేముడు ? రాముడా ? కృష్ణుడా ? వినాయకుడా ? అనే ప్రశ్న ప్రతివారికీ వస్తుంది ఏ దేముడైనా గమ్యం ఒక్కటే. కానీ మనకు ప్రతి దినము లేవగానే కంటికి కనిపించేవాడూ, లోకాల చీకట్లు పోగొట్టేవాడూ, సర్వ ప్రాణికోటినీ సమత్వ బుద్ధితో చూచేవాడూ, కర్మసాక్షీ, లోకసాక్షీ, జ్ఞానదాతా, ఆరోగ్యప్రదాతా, అయిన సూర్యభగవానుని ఆరాధించటం మంచిది ప్రకృతిని ఆరాధించటంలో కూడా మానవుడు మొదటిసారి సూర్యునికే ప్రాధాన్యత నిచ్చాడు ఒక్క మానవుడే కాదు పుట్టిన ప్రతి ప్రాణీ సూర్యరశ్మి సోకకపోతే జీవించలేదు.

సూర్యుడు కాంతికి, శక్తి ఉత్పాదనకు ఆధారభూతుడు. కనుకనే ప్రత్యక్ష దైవంగా, ఆదిమానవుని కాలంనుండి అణుయుగం వరకు సూర్యారాధన సాగుతూనేఉన్నది. వేదకాలంలో ఇంద్రాగ్నులతో పాటు సూర్యుడు కూడా పూజలందుకునేవాడు " శతపథ బ్రాహ్మణం " ద్వాదశాదిత్యులను పేర్కొన్నది. అందువల్ల సంవత్సరానికి గల పన్నెండు నెలలకు ఈ పన్నెండుమంది సూర్యుల సంఖ్య సరిపోతుంది. వారినే ద్వాదశాదిత్యులు అన్నారు.

ఈ పన్నెండు రాశులు ఒక చక్రంకాగా, సూర్యుడు ఒక్కొక్క రాశిలో ఒక్కోనెల ప్రయాణంచేసి, మరియొక రాశిలోకి వెళ్ళే పర్వదినమే ' సంక్రమణం ' అంటారు. సూర్యునికి ఉష, ఛాయ, పద్మిని, భార్యలు కాగా, సువర్ణ, రాజ్ఞి అనేవారు కూడా ఉన్నారని మరి కొన్ని పురాణాలు చెబుతున్నాయి. సూర్యుని పద్మినీ వల్లభా, ఛాయామార్తాండా అని, అందుకేనేమో అంటారు. సూర్యుని కొడుకు యమధర్మరాజు, కూతురు యమి. ఆమే యమునానది అయింది.

సూర్యుని రథము కూడా చిత్రమయినది ' ఏక చక్రము ' సప్తాశ్వములు, మకరధ్వజముతో కూడిన రథముపై అనూరుడు సారథియైయుండగా (అనూరుడు కాళ్ళులేని కదలలేనివాడు) నిరాధారమైన ఆకాశంలో, అందరికీ ఆధారభూతమైన సూర్య భగవానుడు నిర్విరామంగా పరిభ్రమిస్తుంటాడు అనూరుడు వినత పెద్దకుమారుడు, గరుత్మంతునికి అగ్రజుడు.

" సప్తాశ్వ రథ మారూఢం
ప్రచండం కశ్యపాత్మజం
శ్వేతపద్మధరం దేవం
తం సూర్యం ప్రణమామ్యహం "

సూర్యుడు త్రిమూర్తి స్వరూపుడు. ఆయనకు సూర్యనారాయణుడు అనే నామం కూడా ఉన్నది మాఘమాసంలో శుద్ధ సప్తమిని మనం "రథసప్తమి" గాను : సూర్య జయంతి గాను ( పిలుస్తాము ) జరుపుకుంటాము ఆవు పేడతో చేసిన పిడకలపై ఆవుపాలను పొంగించి పొంగలిచేసి చిక్కుడాకులలో సూర్యకుటుంబమునకు, త్రిమూర్తులు, తులసి, అగ్ని దేవుడు మొదలగు వారికి నివేదన చేయటం మన సాంప్రదాయం. పదునాల్గు భువనాలను శాశించి నడిపించేది నిర్గుణ పర

బ్రహ్మతత్త్వం ఆ యొక్క తత్త్వానికి విశ్వచక్షువుగా, అన్ని కర్మలకూ సాక్షీభూతుడుగా, సర్వ సమత్వ బుద్ధితో లోకకల్యాణానికై నిర్విరామంగా పరిభ్రమిస్తున్న ప్రత్యక్షదైవం శ్రీ సూర్యనారాయణమూర్తి.

" యోఽపామాయతనం వేద
ఆయతనవాన్ భవతి
అపోవై తపన్న పామాయతనం
ఆయతనవాన్ భవతి
యోఽముష్యతపత ఆయతనం వేద
ఆయతనవాన్ భవతి
అపోవా అముష్యతపత ఆయతనం,
ఆయతనవాన్ భవతి య ఏవం వేద "

అనగా వేడితో తపింపజేయు సూర్యుడే, జలస్థానమునకు అధినేత. జలస్థానమే ఆదిత్యస్థానము. వీటి పరస్పర అభేదస్థితిని ఎరిగినవారు ముక్తులగుదురు. అని మంత్ర పుష్పంలో చెప్పబడింది.

గోళములలో సూర్యగోళము అధికశక్తి గలది. శాశ్వతపదార్థమై, కర్మలకు సాక్షియై, సకల ప్రాణికోటి అభివృద్ధికి కావలసిన ప్రాణశక్తిని సూర్యుడు ప్రసాదిస్తాడు. ఆ శక్తిని మనము గ్రహించి మనలో ప్రవేశపెట్టుకొని, మన ఆరోగ్యము కాపాడుకొనుటకై, మన పూర్వులు ఋషీశ్వరులు కొన్ని పద్ధతులను కనిపెట్టారు. ఇవి అనేక రకములుగా ఉంటున్నాయి మంత్రములు దానికి నియమములు, ఒక పద్ధతి. రెండవది, సూర్యనామములు జపిస్తూ ఆసనములు వేయుట, ఇవన్నీ కూడ సర్వ జన ఆచరణీయములే. కుల, మత, వయో, లింగ భేదములు లేనివి ఈ పద్ధతులు ప్రకృతి మనకు ప్రసాదించిన ముఖ్యమయిన పవిత్రమైన, తేలికైన ఆరోగ్యసూత్రము సూర్యోపాసన

మన పూర్వపురాజులలో చాలామంది సూర్యవంశోద్భవులు ఉన్నారు శ్రీరామచంద్రుడు, అంబరీషుడు మొదలగు వారందరూ సూర్యవంశపువారే రామ, రావణ యుద్ధ సమయంలో 'అగస్త్య' మహర్షి శ్రీరామచంద్రునికి ఆదిత్యహృదయం ఉపదేశించటం జరిగింది. భవిష్యత్ పురాణంలో శ్రీకృష్ణుని కొడుకు సాంబునకు సూర్యారాధనవలన కుష్ఠురోగ నివారణ అయినట్లు చెప్పబడింది. కాబట్టి సూర్యారాధన ఈనాటిది కాదని స్పష్టమవుతున్నది. సూర్యునికి ప్రసిద్ధి చెందిన ఆలయములు కూడా కలవు. " కాశ్మీరులోని మార్తాండ " దేవాలయము "ఒరిస్సా"లోని కోణార్క్ దేవాలయము ఆంధ్రలో "అరసవిల్లి" (శ్రీకాకుళం) దేవాలయములు మిక్కిలి ప్రసిద్ధిచెందినవి. ప్రస్తుత వైజ్ఞానిక ప్రపంచంలో కూడా సౌరశక్తివల్ల మానవులు చాలా లాభాలను సుఖాలను పొందుతున్నారు. మానవ శరీరంలోని ప్రధాన నాడులలో ఒకటైన "పింగళినాడి-సూర్యనాడి" విజ్ఞానశాస్త్రం కూడా సూర్యునికి నాడీశాస్త్రానికి గల సంబంధాన్ని తెలుపుతున్నది. సూర్యుడు, దేశ, జాతి, మత, కుల, భాషా, భేదరహితంగా, సమస్త సృష్టికి, వెలుగును, ప్రాణశక్తిని ఇస్తున్నాడు, కనుక ప్రాణదాత అయిన సూర్యనారాయణుడు మన ప్రత్యక్షదైవం. ఆ సూర్యుణ్ణి ప్రతి దినము, ప్రతి మానవుడు, భక్తి శ్రద్ధలతో పూజించిననాడు ఆయన సర్వులయందుచూపే సమత్వాన్ని గుర్తించిననాడు మనలో దానవత్వం, పశుత్వం, పోయి అసలైన మానవులుగా సుఖసంతోషాలతో ఆయురారోగ్యాలతో జీవించగలుగుతాము.

నమస్సవిత్రే జగదేక చక్షుషే
జగత్ప్రసూతిస్థితి నాశ హేతవే
త్రయీమయాయ త్రిగుణాత్మ ధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే॥

రాత్రి, పగలు, సూర్యునివలననే మనము తెలుసుకోగలుగుతాము. పూర్వము, మాండవ్యమహా ముని శాపంవల్ల, సుమతి, పతి తెల్లవారేసరికి మరణిస్తాడని తెలిసి, పతివ్రత అయిన సుమతి అసలు సూర్యగమనాన్ని నిరోధించింది. లోకాలు తల్లడిల్లిపోయాయి. నిత్యాగ్నిహోత్రులు, ఋషులు, మునులు కారణం తెలుసుకొని, దానికి పరిష్కారమార్గం ఆలోచించి, సూర్యగమనాన్ని సక్రమంగా జరిగేటట్లు చూశారు. సూర్యగమనమే నిలిచిపోతే సమస్త చరాచరసృష్టి నిలిచిపోతుంది. సర్వమతస్థులకు ఆరాధ్యదైవం సూర్యుడే ◯

# "గవాం మధ్యే వసామ్యహం"

డా. రాపర్ల జనార్ధనరావు

("అహం,) నేను,(గవాం మధ్యే) గోవులమధ్య, (వసామి) నివసించుచున్నాను పరమాత్మ తాను గోవుల మధ్య వసించుచున్నానని శ్రీమద్భాగవతము నందు తెలియబరచియున్నాడు శ్రీమహావిష్ణువు తన నెలవును ప్రకటించుకొనియున్నాడు భారతీయసంస్కృతికి గోవు పట్టుకొమ్మ. గోక్షీరము, గోదధి, గోఘృతము, తేనె, కొబ్బరినీళ్ళు కలిపి పంచ అమృతములు (పంచామృతములు) మనము అన్ని పూజలలోను నివేదనచేసి స్వీకరించుచున్నాము. ఆవుపాలు, ఆవువెన్న, జున్ను మీగడ, పెరుగు త్రాగి సాత్విక సంపద పెంపొందగా, రాక్షస శక్తిగల కంసుని గోపాలుడు తుదముట్టించినాడు.

అందువలననే గోవులు, సాత్విక భావన కలిగిన బ్రాహ్మణుడు వృద్ధిపొందుదురుగాక "గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం" ఇచ్చట బ్రాహ్మణుడనగా జన్మతః బ్రాహ్మణుడు గాక, 'బ్రహ్మఅణతీతి బ్రాహ్మణః' బ్రహ్మను ఉపాసించు సాధకుడు వృద్ధిపొందుగాక అని అర్థము చెప్పుకొనవలసివచ్చును.

గోవు మధ్య శ్రీమన్నారాయణుడు వసించుచున్నచో గోపృష్ఠ భాగమున, ఆవు పేడ, ఆవు మూత్రమున లక్ష్మి వసించుచున్నదని తెల్పబడియున్నది. అందువలననే గృహప్రవేశమునకు పూర్వము ఆవును ఇంటిలో ఒక దినము కట్టివుంచుట ఆచారము. గోమూత్రము అనేక విధములుగ వైద్యమునకు ఉపయోగించెదరు. పరమ విషమైన నాభికొమ్మును గోమూత్రముచే శుద్ధి చేయబడినచో అయ్యది ఆనందభైరవి అనెడి ఔషధముగ ఏర్పడుచున్నది విషము త్రాగిన వానికి ఆవుపేడ బాగుగ నీళ్ళలో కలిపి వడబోసి కడుపు నిండ పట్టించినచో విషము శక్తి హీనమగును.

ప్రతి వస్తువునకు బ్రహ్మసృష్టి, విశ్వామిత్ర సృష్టి యును రెండు మంచి చెడుల నిర్ణయములున్నవి. గోవు బ్రహ్మసృష్టియైనచో గేదె విశ్వామిత్ర సృష్టి. అటులనే కొబ్బరిచెట్టు బ్రహ్మసృష్టి, తాడిచెట్టు విశ్వామిత్రసృష్టి వెల్లుల్లి బ్రహ్మసృష్టి, నీరుల్లి విశ్వామిత్రసృష్టి యని చెప్పవచ్చు. బ్రహ్మసృష్టి వస్తువులు ఆత్మదీప్తికరములు.

ఆవుదూడ, చెంగు చెంగున ఎగురుట చూచి ఏ వ్యక్తి ఆనందింపకుండ ఉండగలడు ? మరి గేదె దూడ సంగతి చెప్పనక్కరలేదు

ఋషుల గురుకులములందు గోసంతతి యుండుట తెలిసిన విషయము. ఇక్ష్వాకుల రాజు దిలీపుడు గోవు కొరకై సర్వ త్యాగమునకు సిద్ధపడినాడు గనుకనే అతని వంశము మహోన్నతమైన కీర్తిబడసినది. వసిష్ఠుని వద్ద గల నంది యనెడి గోవు కోరిన వరములిచ్చెడిదట. గోవుల కొరకు ఉత్తరగోగ్రహణ యుద్ధము జరిగినది

గోసేవ,గోరక్షణ భారతీయులకెల్లరకు ముఖ్యాంశము. భూమాతయే గోమాతగ రూపొందినదని శాస్త్రములు తెల్పుచున్నవి శ్రీ వేంకటేశ్వరునికి ఆ శ్రీనివాసునికి గోమాతయే కదా క్షీరములనిచ్చి పోషించినది

అట్టి గోవులను నేడు సరిగా పోషించక, బక్కచిక్కి ఎండిపోయి, వేసవికాలమున త్రాగుటకు నీరుకూడ లేక మందలు మందలు అడవులకు త్రోలుచున్నాము. కేవలము కార్తీకమాసము దీపారాధనకు మాత్రము ఆవు నెయ్యి తెప్పించుచున్నాము.

పుణ్య దినములయందు, పితృ కార్యములయందు బాహుళ్యముగా చేయలేనివారు, పరిస్థితులు అనుకూలముగ లేనివారు, గోవులకు నుదుట, పృష్ఠమున, పసుపు కుంకుమ అలది, కడుపునిండ ఆహారముపెట్టి, సతీపతులు, కుటుంబసభ్యులు ముమ్మారు ప్రదక్షిణము చేసినచో సర్వశుభములు, మనశ్శాంతి లభించునవి పెద్దలు తెల్పియున్నారు.

ఇంతయేల ! పరమాత్మ "గవాం మధ్యే వసామ్యహమ్" అనెడి ఒక్క చిన్ని వాక్యములోన, తన అడ్రసు ఇచ్చియున్నాడు గమనించండి.

సంక్రాంతి సందేశం

# అనేకత్వంలోని ఏకత్వమును గుర్తింపజేయునవే ఆటలు

—భగవాన్ బాబావారి దివ్యప్రబోధ

" సదయం హృదయం యస్య భాషితం
సత్య భూషితం
శరీరం పరహితేస్య సత్యం తస్య
కలికిం కరోతి ? "

ఎవరి హృదయము దయతో కూడి ఉండునో, ఎవరి వాక్కు సత్యముతో చేరి ఉండునో, ఎవరి శరీరము పరహితమైన కార్యక్రమములలో పాల్గొనునో అట్టి వ్యక్తిని కలి కూడనూ ఏమియూ చేయజాలడు.

" దినకరుడు శాంతుడై తోచె దినములింత
కురుచలయ్యెను చలిగాలి చురుకు హెచ్చె
పొలములన్ రేయి గ్రుడ్డి వెన్నెల లోన
కుప్పలన్ నూర్చు కాపులు గొంతులెత్తి
పదములను బాడదొడగిరి పచ్చపూలు
జనుప చేలకు ముత్యాల సరులు గూర్చె
మిరుపపండ్లకు కుంకుమ మెరుపుదాల్చె
బంతిపువ్వుల మొగము లల్లంత విప్పె
మన గృహంబుల ధాన్య సంపదల నిలిపి
సరసురాలైన మకరసంక్రమణమెచ్చె "

పవిత్రమైన ఈ మకరసంక్రమణంనాడు దివ్యమైన, శివ్యమైన, నవ్యమైనటువంటి మానవ జీవితమునకు క్రాంతులు చేకూర్చే నిమిత్తమై యువతుల మనస్సులను సర్వ మానవం చేసే నిమిత్తమైన దివ్యమైన కాలము ఆసన్నమైనది.

" భోగ భాగ్యంబులవి ఎన్నింటి పొందియున్న
శాంతి మనిషికి లేదోయి చెప్పుచున్న
దివ్య భావంబు చేకూరినపుడె కాని
శాంతి సుఖములు మనిషికి ప్రాప్తినొందు. "

సాధారణముగా ఈ భౌతిక ప్రపంచములో మనము దేనిని జ్ఞానమని భావించుచున్నామో అది సరిఅయిన జ్ఞానము కానేరదు ఆత్మజ్ఞానమే అసలయిన జ్ఞానము ఆత్మ అన్నా జ్ఞానమన్నా రెండూ ఒక్కటే జ్ఞానము నిత్య ఉనికి ఇట్టి జ్ఞానము విషయములతో కాని లేక తలంపులతో కాని, లభ్యమయ్యేటటువంటిది కాదు. ప్రపంచములో స్వీకరించే విషయములు జ్ఞానమునకు సంబంధించినవి కావు మనోనాశనము అయిన తరువాత మిగిలినదే జ్ఞానము. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అని త్రిపుటీ స్వరూపము కాదు. ఇవి నిరంతరము కూడనూ చలించునవే. తానెవరో తాను తెలుసుకొనక మిగిలినవన్నీ తెలుసుకోవటం అజ్ఞానమే. ఏ జ్ఞానము మానవుని ఇంద్రియ ఉత్పత్తి శక్తిని అణగద్రొక్కునో అదే నిజమయిన జ్ఞానము. ప్రతి మానవుడు కూడనూ జ్ఞానమయుడే. కాని అతనిని కామము ఆవరించటముచేత అతని యొక్క స్వస్వరూపాన్ని తాను గుర్తించుకోలేక పోతున్నాడు. కా, మ ఇవి రెండు పదములు ' క ' అనగా సుఖము, "మ" అనగా పరిమితి, కామ; అనగా పరిమితమయిన సుఖమే, వాంఛ ఈనాడు ప్రపంచములో ప్రతి మానవుడు వాంఛించే వాంఛలన్నియు కూడనూ పరిమితముతో పొందినవే ఈ పరిమితమైన వాంఛలు మితిమీరిన, ఇది మోహము అని పిలువబడుతుంది మ + ఊహ = మోహ : మ అనగా పరిమితము ఊహ అనగా లేనిదానిని విశ్వసించటము. లేనిదానిని విశ్వసించటమే మోహముయొక్క ప్రభావము. ఈనాడు

ప్రపంచములోని ప్రతి మానవుడు కూడనూ ఈ మోహమునందు మునిగి, తన స్వరూపాన్ని తాను మరచి సత్యమైన నిత్యమైన సత్యాన్ని విస్మరించి కాలమును వ్యర్థంగావించుకుంటున్నారు వాంఛలు నెరవేరిన ఆనందం అని భావిస్తున్నాడు. వాంఛలు తీరటము ఆనందము కాదు, వాంఛలు తరిగిపోవాలి. వాంఛలుఆరటమే ఆనందం మానవుని ప్రేమించవచ్చును గాని విశ్వసించరాదు కారణమేమనగా మానవుడు శాశ్వతమైనవాడు కాదు విశ్వసించవలసినది భగవంతుడినేగాని మానవుని కాదు ప్రేమించదగినవాడే మానవుడు. కనుక మానవత్వం యొక్క దివ్యమైన స్థితిని గుర్తించటానికి ప్రయత్నించాలి. మానవుని మనస్సును దైవం వైపు మరల్చటమే మానవత. అదియే దివ్యమైన వ్రతం. అదియే మానవ మతం. అదియే సాధకుని వ్రతము. తన మనస్సును మాధవుని పైన మరల్చాలి. కాని దురదృష్టవశాత్తు ఈనాటి మానవుడు మానవుని యొక్క తత్త్వాన్ని విస్మరిస్తున్నాడు. మానవత్వమంత కూడనూ మనస్సుతో కూడి ఉంటున్నది. మనస్సుతో కూడినవాడే మానవుడు. ఆత్మతో చేరినవాడే దైవత్వం. మనో ఇంద్రియములతో కూడినవాడే బంధములకు మూలకారణం కనుక మనస్తత్త్వము మానవత్వంతో కూడటం, ఆత్మతత్త్వము దివ్యత్వంలో చేరటం, మనో ఇంద్రియముల చేరికే బంధములకు మూలకారణమని ప్రతి మానవుడు గుర్తించాలి కర్తృత్వ భోక్తృత్వమనేవి మనస్సుతో చేరినటువంటివి జాగ్రత్ స్వప్నములన్నియూ కూడనూ మనస్సుయొక్క వికారములే ఈ మనస్సు యొక్క తత్త్వముండినంతవరకును మానవునికి దుఃఖము, క్రోధము, విచారము, బంధన తప్పినవి కాదు గాఢ నిద్రలో మనస్సులేదు మనస్సు లేని సమయంలో ప్రపంచము కూడనూ లేదు ప్రపంచము లేనప్పుడు సుఖ దుఃఖములు కూడా ఉండవు. కనుక మనోలయమే ఆనందమునకు మూలకారణమని వేదాంతము కూడా బోధిస్తూవచ్చింది ఈ అన్నింటి మూలకారణమైన దైవత్వమే ప్రధానమైన సూత్రము.

నేను విద్యార్థిని, నేను అధ్యాపకుడను, నేను స్త్రీని, నేను పురుషుడను, ఈ పదములన్నింటికీ మొదటి పదము ఏమిటి ? రెండవ పదము ఏమిటి ? అవి ప్రతి వ్యక్తి కూడనూ విచారించవలసిన అవసరమున్నది. నేను విద్యార్థిని, నేను అన్న పదమే ఉనికి. ఇదే ఆత్మతత్త్వమునకు సరిఅయిన పర్యాయపదము. ఇదే భగవత్తత్త్వము, నేను అనే పదము తరవాతనే విద్యార్థి అనే పదము వస్తున్నది నేను అనే పదము తరువాతనే అధ్యాపకుడను అనే పదము వస్తున్నది. ఇదే విధముగనే నేను అనేటటువంటిది భగవత్తత్త్వముతో కూడుకొని, నేను విద్యార్థిని, నేను అధ్యాపకుడను, నేను స్త్రీని, నేను పురుషుడను, నేను గృహస్థుడను, నేను సన్యాసిని అనే పదములు చేరి వస్తున్నాయి. విద్యార్థి, అధ్యాపకుడు, స్త్రీ, పురుష, సన్యాసి, గృహస్థు అనే పదములు మారుతున్నాయిగాని నేను అనే పదము ఎప్పటికీ, ఎక్కడ కూడనూ మారడానికి వీలులేదు. అది మారదు. అట్టి మారని తత్త్వమే దైవత్వము. కనుకనే ప్రతి మానవుడు కూడనూ తన నిత్య జీవితంలో "నేను" అనే పదము అర్థం తెలియకుండా ఉపయోగించుకుంటూ ఆ దివ్యత్వాన్ని వ్యర్థం గావించుకుంటున్నాడు. దీనికి భౌతికమైన, లౌకికమైన విషయ వాసనలో మునగడమే మూలకారణం ఎండమావులు నీరువలే కన్పించుచున్నాయే గాని, వాటిని సమీపించుకొలది మనకు అంతర్ధానమగుటయే గానీ మన దాహమును తీర్చటం లేదు. ఇదియే మోహము. నీరు అని నమ్మి సమీపమునకు పరిగెత్తుతున్నాడు మానవుడు. పరిగెత్తుకొలది ఈ యొక్క నీరుగా కన్పించు ఎండమావులు మరింత దూరమవుతున్నాయి. దీని వలన మానవులకు లభించిన ఫలితం ఏమిటి ? దాహము తీరక శ్రమకు గురిఅయి, కడపటికి తన ప్రాణములను కోల్పోతున్నాడు ఇదియే

మోహము లేని దానిని విశ్వసించి, ఉన్నదానిని విస్మరించి, కాలమును వ్యర్థముగావించుకొని, కోరికలనే దాహముతో జీవిత ప్రయాణము సలిపి, కడపటికి నిరాశ, నిస్పృహల లోపల కూలి కాలిపోతున్నాడు మానవుడు. నిరాశకు కారణము ? నీ విశ్వాసమే ఏ విశ్వాసము ? దైవ విశ్వాసం కాదు. లేనిది ఉన్నదనే విశ్వాసమే. కనుక మానవుడు ఈ కతృత్వ భోక్తృత్వ ముల చేతనే మానవుడు బంధితుడు అవుతున్నాడు. దీని ఫలమును అనుభవింపక తప్పదు. ఏ విధంగా ? ఇది నాది, ఇది నేను. అనుకున్నప్పుడు తాను నాది అనే భావముతో ఆచరించిన కర్మయొక్క ఫలితమును తాను అనుభవించక తప్పదు కదా! ఇది నా భూమి నా భూమి అంటున్నప్పుడు ఆ భూమియందు ఉల్లివేసుకోవచ్చును, మల్లివేసుకోవచ్చును. ఈ రెండింటికీ అతనికి స్వతంత్రం ఉన్నదిగాని, అందులో పండినటువంటి పంట ఏది అయిననూ సరే తాను అనుభవించేతీరాలి. ఆ ఫలితము తనకు చెందినదేగాని మరొకరికి చెందినది కాదు. అదే విధముగనే ఇది నాది అనే కతృత్వ భోక్తృత్వము లుండినప్పుడు దానియొక్క ఫలితములు తనకు తప్పవు. కనుకనే ప్రతి మానవునికి కూడనూ "నేను" "నాది" ఈ రెండే బంధనలు. కనుక మానవుడు తన బంధనలకు తన అభీష్టములే మూలకారణం విషయములను విశ్వసించినంత విశ్వాసము దైవాన్ని విశ్వసించటానికి ఏమాత్రం పూనుకోరు అనిత్యము, అశాశ్వతము అసత్యము అయిన విషయాలను విశ్వసిస్తుంటాడు గాఢంగా మానవుడు నిత్య సత్యమైనటువంటి, స్వార్థరహితమైనటువంటి భగవత్ ప్రేమను విశ్వసించటానికి వెనుకంజ వేస్తుంటాడు మానవుడు. ఇదే కర్మ ఫలము. ఇదియే ప్రారబ్ధము. ఈ ప్రారబ్ధమనేది మానవుని వెంటాడుతూ అనేక విధముల కూడనూ దారి తప్పించి, పెడమార్గం పట్టించి, మంచి దారిపైన విశ్వాసం మూలంగావించుకొని, చెడ్డ దానిని విశ్వసిస్తూ ఉంటాడు. ఏ విధంగా ? ప్రతి మానవుడి ఇంటియందు కూడనూ ఎలుకల బోను ఒకటి ఉంటుండాలి. ఎలుకలు పట్టే నిమిత్తమై దానిని చంపే నిమిత్తమై ఆ బోను యందు ఏవో కొన్ని విధములయిన వాసనలు పెట్టి, ఆ వాసనలు ఆకర్షించే విధంగా ఏర్పర్చుతాడు. ఆ వాసనలను విశ్వసించి ఆ ఎలుకలు అందులో చేరి బంధింపబడుతుంటాయి. అదే విధంగానే ఈ ప్రపంచమనే బోను లోపల విషయవాసనలనే వాసనలను చేకూర్చి, తద్వారా మానవుని బంధింపచేస్తుండాలి కాని ఈ సత్యాన్ని మానవుడు గుర్తించలేకపోతున్నాడు. ముందు వచ్చే ముప్పు ఏమిటో విచారించలేకపోతుండాలి ఎలుక కేవలం వాసనలను మాత్రమే ఆశిస్తుండాలి ఎలుక కనుక ఈనాటి మానవుడు ఎలుకవంటివాడుగా జీవిస్తున్నాడు. ముందు ఏమి జరుగునో అనే దానిని విచారించలేకపోతున్నాడు భగవత్ ఆజ్ఞలను ఉల్లంఘిస్తూ న్నాడు. భగవత్ శాసనాన్ని మీరిపోతున్నాడు విషయానికి బందీ అవుతున్నాడు వాంఛలలో చిక్కుకుంటున్నాడు బాధలకు గురి అవుతున్నాడు కట్టకడపటికి ఆనాడు భగవంతుని విశ్వసించటానికి ప్రయత్నిస్తున్నాడు మానవుడు.

కనుక మానవత్వంలో ఉండినటువంటి బలహీనత ఈ విధమైనటువంటి వాంఛల చేతనే మానవుని స్థితిగతులు మార్పుచెందుతున్నాయి. విశ్వసించిన మానవుడైన విశ్వసించని మానవుడైనా పూర్వం దివ్యత్వమనేది తెలిసినా తెలియకపోయినా స్పష్టముగా ఉంటున్నది కాని తనకు తెలియలేదని మోసపోతున్నాడు భగవత్ తత్త్వమంటే ఏమిటి ? దేనిని భగవంతుడని తాను విశ్వసిస్తున్నాడు ఏ విధంగా భగవంతుడు కాదని వర్ణిస్తున్నాడు ఇది కేవలం ఒక విధమైన అంధకారమైన అజ్ఞానము. భగవంతుడు ఎట్లా ఉంటాడని తెలిస్తేకదా ! ఇతను భగవంతుడు ఇతడు కాదు అని నిర్ణయించే అధికారం వస్తుంది భగవంతుడు అంటే ఏమిటో తెలియని వానికి విశ్వసించటం, విశ్వసించక పోవటమనేది కేవలం ఒక ఊహాగానమే. ఎప్పుడయినా తాను చూచి ఉంటే ఇలాంటిది భగవత్ తత్త్వము అని విశ్వసించవచ్చు. ఏదీ తెలియని వానికి ఇది భగవత్

తత్త్వము. ఇది కాదు అని నిర్ణయించలేరు. అలాంటి వారికి నిర్ణయించే అధికారమే లేదు. తనను తానే తెలుసుకోలేనివాడు భగవంతుని ఏ రీతిగా తెలుసుకో గలడు ? తెలుసుకోవటానికి ప్రయత్నించటమూ వ్యర్థమే. తానే భగవత్ తత్త్వము. ఇలాంటి విశ్వాసమును ఈనాడు మానవుడు కోల్పోతున్నాడు. ఎన్నియో చదువులు చదువుతున్నాడు, ఎంతయో జ్ఞానాన్ని ఆర్జిస్తున్నాడు. కాని ఈ జ్ఞానమంతయు కూడనూ కేవలం విషయ జ్ఞానమే. ఈ జ్ఞానమంతయు కూడను కేవలం పదార్థజ్ఞానమే. మానవుడు ఆశించవలసినది అర్థమును గాదు పదార్థమును మానవుడు చేయవలసినది అధర్మాన్ని కాదు ధర్మాన్ని. మానవుడు పొందవలసినది దయ్యాన్ని కాదు, దైవాన్ని. కాని మానవుడు ఈ సత్యాన్ని విచారించలేకపోతున్నాడు. నిత్యానిత్య విషయ పరశీలన లేక అవివేకుడై పోతున్నాడు. మనవెంట వచ్చేది సంసారం కాదు సంస్కారమే. కనుక అట్టి సంస్కారమును ఈనాడు విశ్వసించటం లేదు. కనుక మానవుడు దైవత్వమనేది ఎక్కడ ఉంటున్నదని విచారించినప్పుడు ఒక చిన్న ఉదాహరణ.

ఆత్మకు ఒక రూపం లేదు. బ్రహ్మమునకు ఒక రూపం లేదు. దైవమునకూ ఒక రూపం లేదు. ఏ రూపమునైనా చేరవచ్చు. ఏ యొక్క స్థితియందైనను తాను దర్శించవచ్చు. చక్కెర పాకం చేస్తున్నాం మనం. కాని ఎలాంటి ప్రింటు పైన వేస్తే అలాంటి రూపం ధరిస్తుంది ఆ చక్కెర. మార్కెట్టులో పిల్లలను ఆకర్షించే నిమిత్తమై చక్కెర బొమ్మలన్నీ చేస్తుంటారు. ఒకటి జింకగా ఉంటుంది, ఒకటి దుప్పిగా ఉంటుంది. ఒకటి పులిగా వుంటుంది, ఒకటి కుక్కగా ఉంటుంది. కాని ఇది కుక్క, ఇది నక్క, ఇది పులి అని ఈ విధంగా మనం విచారణ చేస్తున్నాము గాని, అన్నింటి

## శ్రీసాయివాణి

* ఓర్పును మించిన తపస్సు లేదు.
* కంఠస్థ ఉపన్యాసాలు కంఠశోష కే
* కాలమే లేకపోతే కాయమే పెరగదు
* గ్రామసేవే రామ సేవ
* దైవాన్ని విస్మరించకండి! జగత్తును విశ్వసించకండి! జీవితాన్ని వ్యర్థం చేయకండి!
* ధనాన్ని సద్వినియోగం చేయనివాడే మహాదరిద్రుడు.
* నియమం లేకపోతే మానవత్వం శూన్యం అవుతుంది.

యందు ఉండే చక్కెర ఒక్కటే. చక్కెర యొక్క తీపికి ఏమాత్రం రూపము లేదు. చక్కెర ఎట్లా ఉన్నదని అంటే తెల్లగా ఉన్నదని చెప్పవచ్చు. తీపి ఎట్లా ఉంది అంటే ఎవరు చెప్పగలరు? ఇది అనుభవం తోనే రావాలి. కనుకనే తీపికి రూపం చెప్పేటటువంటి వాడు అజ్ఞాని అనే చెప్పవచ్చును. ఆ తీపి ఎక్కడ ఉంటున్నది? ఒక ఆలోచనకు మరొక ఆలోచనకు మధ్య నున్న ఆలోచనారహితమైనటువంటిదే ఆత్మ తత్త్వము. అదియే నిజమైన ఆత్మతత్త్వము. కనుక నీ ఆలోచనపైన నీవు Consantation చేస్తున్నావు. కాని ఆలోచనారహితమైన దానిపైన నీవు Consantation చేయడం లేదు.

విద్యార్థులారా ! మీరు చదివే చదువులన్నియూ కూడనూ, అర్థంకోసం చదువుతున్నారేగాని, పరమార్థం కోసం కాదు. మనము ధనము ఖర్చు పెడితే తరగి పోతున్నది. కాని ఆరోగ్యం చెడిపోతుంది

ఆరోగ్యం చెడిపోయినా, ఆరోగ్యాన్ని తిరిగి సంపాదించుకోవచ్చును. వ్యర్థంఅయిన ధనాన్ని కూడనూ సంపాదించవచ్చును. వ్యర్థం అయిన కాలాన్ని మాత్రం క్షణమయినా తిరిగి మనం సంపాదించుకోలేము. కనుక ప్రతి విద్యార్థి కూడనూ ధనము కాని, పదార్థములు కాని మనం ఖర్చు పెట్టినప్పుడే అవి ఖర్చు అవుతున్నాయి. లేకపోతే అవి ఖర్చు కావటం లేదు కాని మన ఆయుఃప్రమాణం మాత్రం నువ్వు ఖర్చు పెట్టు, పెట్టకపో అది మాత్రం క్షీణించుకొని పోతుంటుంది. కనుక కాలమును వ్యర్థము గావించుకోరాదు ఈ కాలము వ్యర్థంగావించుకోవటమే మానవుని యొక్క అజ్ఞానము. కాలము భగవత్ స్వరూపము. ఆ కాలాన్ని సార్థకం గావించుకొనే కర్మలాచరించి, ఆ కర్మల ద్వారా ఆనందమనే దానిని అనుభవించి, ఈ ఆనందమును పదిమందికి పంచటానికి ప్రయత్నించాలి

మన విద్యార్థులయొక్క స్వభావములు చాలా ఉన్నతమైనవి, సున్నితమైనవి. ఈనాటి ఆటలు పాటలు కూడనూ కేవలం ఒక వ్యాపార రంగంలో చేరటంచేత దాని విలువలు కూడనూ క్షీణించిపోతున్నాయి. ఆటలు ఆనందము నిమిత్తమై ఏర్పడినటువంటివి. పాటలు హృదయానందము చేకూర్చేటటువంటిది. కాని అట్టి హృదయానందము అందించే ఆటలు, పాటలు ఈనాడు కేవలం వ్యాపారరంగంలో ప్రవేశపెట్టి, మానవునియొక్క విలువలు ఏవిధంగా క్షీణించిపోయినవో అదే విధంగా ఆటల పాటల యొక్క విలువలు కూడను క్షీణించిపోయినవి. ఆటలచేత, పాటలచేత, ఆనందాన్ని ఆరోగ్యాన్ని పుష్టిని, సంతుష్టిని పొందాలి. ఒకరినొకరు ద్వేషాన్ని పెట్టుకోరాదు అసూయ అంతకంటే పెంచుకోరాదు ఈనాటి ఆటలు, పాటలలో అసూయ అధికమైపోతున్నాయి ద్వేషాలు పెరిగిపోతున్నాయి. తన విలువ తరిగిపోతున్నాది. కనుక మన విద్యాలయ పిల్లలు. ఈ ఆటలు, పాటలు ఆనంద నిమిత్తం, ఆరోగ్య నిమిత్తం ఏర్పడినవనే సత్యాన్ని గుర్తించి వర్తించటం అత్యవసరం. అనేకత్వంలోని ఏకత్వాన్ని గుర్తింపచేయునవే ఆటలు. పిల్లలు వేరువేరు స్థానమునుంచి, వేరువేరు సంస్కారము నుంచి, వేరువేరు భావమునుంచి వచ్చినప్పటికి ఆటలలో అందరూ ఐక్యత చేరి దీనియొక్క విషయాన్ని అందుకోవాలి అందరూ అన్నదమ్ములుగా మనం జీవించాలి. కాని ఇవన్నీకూడనూ దైవార్పితభావంతో ఆచరించాలి. Work will be transform into worship మనము ఏది చేసిననూ అది ఒక ఆధ్యాత్మికమార్గంలో ప్రవేశపెట్టాలి ఇదే నిజమైనటువంటి ఆటల విలువలను పెంచుకోవటం, ఆటల విలువ పెరిగినప్పుడే ఆటలాడే వ్యక్తి విలువ పెరుగుతుంది. ఈనాడు తరిగిపోయింది, ఆటలాడే వ్యక్తుల విలువ ఒక పాట పాడండి అంటే ఎంత యిస్తావు? అని వ్యాపారం చేస్తారు. ఏదో బెంగుళూరులో ఒక ఆడిటోరియంలో ఒక ఆట ఆడాలి అంటే దీనికి ఎంత? అని అడుగుతున్నారు. ఈ విధంగా ఒక వ్యాపార రంగంలో ప్రవేశపెడుతున్నారు ఈ ఆటలు, పాటలు. కనుకనే మానవుని ఆనందము దినదినమునకు తరిగిపోవటమే కాకుండా నైతిక విలువలు కూడనూ తరిగిపోతుండాలి.

మానవత్వం యొక్క విలువలను మనం అభివృద్ధి గావించుకోవటానికి ప్రయత్నించాలి. మానవులుగా పుట్టాం, మానవులుగా జీవించాలి. మానవత్వాన్ని మనం నిలుపుకోవాలి. ఏ విధంగా మనం నిలుపుకోవాలి? అన్నింటి పైన విశ్వాసము...విశ్వాసము... గాఢమైన విశ్వాసాన్ని మనం పెంచుకోవాలి. చిల్లర చిల్లర విషయాలను మనం నమ్ముతున్నాం. దీనికి ఏమిటి మనకు సాక్ష్యం? ఏ సాక్ష్యం లేకపోయిననూ మనం విశ్వసిస్తున్నాం.

(తరువాయి 45 వ పేజీలో)

# గురుదక్షిణ

కవుల ఆంజనేయశర్మ

కోసల రాజ్యాన్ని రఘుమహారాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయన పాలనలో ధర్మం నాలుగు పాదాల నడిచింది. వేద విద్య అభివృద్ధి చెందింది పేరు మోసిన గురువుల ఆధ్వర్యంలో గురుకలాలు ప్రసిద్ధి కెక్కాయి. వరతంతు మహర్షి ఆశ్రమంలోని గురుకులం అట్టి వాటిల్లో ఒకటి. దూర ప్రాంతాల నుండి విద్యార్థులు జ్ఞాన సంపాదనకు వచ్చి గురువును ఆశ్రయించేవారు అటువంటి విద్యార్థుల్లో "కౌత్సుడు" అనే బాల విద్యార్థి ఒకడు. ఉపనయనము పూర్తి చేసి, చిన్నప్పుడే తల్లి తండ్రులు అతన్ని వరతంతు మహర్షికి అప్పగించారు. గురుపత్ని ఆదరాభిమానాలతో, మహర్షి వాత్సల్యంతో విద్యల నభ్యసించాడు కౌత్సుడు. పద్నాలుగు సంవత్సరాలు నియమ నిష్ఠతో చదువు పూర్తి చేసి, గురుదేవుని పాదాలకు నమస్కరించాడు.

'నాయనా ! కౌత్సా ! గృహస్థుడవై, నిత్యధర్మ నిరతుడవై నేర్చుకొన్న విద్యలకు ప్రయోజనం సాధించి, తల్లిదండ్రులకు, గురువుకు, కీర్తి తీసుకురావాలి సుఖంగా పోయిరా !' - అని దీవించారు మహర్షి దంపతులు.

గురు దేవుని పాదాలనుండి నెమ్మదిగా తన శిరస్సును ఎత్తి 'గురుదేవా ! ... ' అన్నాడు కౌత్సకుడు.

'ఏం ! నాయనా ?' - అన్నారు గురుదేవులు.

'నేను నేర్చిన విద్యలకు గాను, నా శక్తికొలది మీకేమైనా గురుదక్షిణ సమర్పించవలసియున్నది. ఏమి యిమ్మందురో సెలవిండు' అన్నాడు భక్తితో కౌత్సుడు.

"వద్దు నాయనా ! నాకు గురుదక్షిణ అవసరంలేదు. నీవు నాకు చేసిన సేవయే చాలు. నీవు నేర్చిన విద్యకు ప్రయోజనం సాధించు. అంతేచాలు సుఖంగా పోయిరా' అన్నాడు వరతంతు మహర్షి.

కౌత్సుడు వంచిన తల ఎత్తలేదు అక్కడి నుండి కదలనూ లేదు. గురుదక్షిణ స్వీకరించ మని పాదాలపై బడి ప్రార్థించాడు. గురువు ఎంత చెప్పినా వినలేదు. మహర్షికి శిష్యుని శక్తి పరీక్షించాలన్న కోరిక కలిగింది.

"నాయనా ! నేను ఎంత చెప్పినా వినకున్నావు. నీ పట్టుదలను విడువకున్నావు. సరే ! నీవు నా యొద్ద పద్నాలుగు సంవత్సరాలు, పద్నాలుగు విద్యలు, నేర్చావు. కనుక, పద్నాలుగు రోజుల్లో పద్నాలుగు కోట్ల బంగారు నాణాలను తెచ్చి, గురుదక్షిణగా సమర్పించు" అన్నాడు మహర్షి

"మహాప్రసాదం" అని బయలుదేరాడు కౌత్సుడు. "అంత సొమ్ము ఎక్కడనుండి తేగలను" అనే విచారం కూడా అతని ముఖంలో కన్పడలేదు. "గురుదేవుడు కోరినాడు, ఎట్లయినా సమర్పించుకొందును" అనుకొన్నాడు నదులు, కొండలు దాటి సరాసరి రఘుమహారాజు రాజ్యం చేరుకొన్నాడు అంత ధనము తనకు ఈయదగినవాడు రఘుమహారాజు ఒక్కడే

మట్టి పాత్రలతో ఆర్ఘ్యమిచ్చుటకు నీటిని తీసుకొని వచ్చుచున్న రఘుమహారాజును చూచాడు కౌత్సుడు. దిగాలుపడినాడు అతిథిసత్కారాలైన తర్వాత "వెళ్ళి వస్తానన్నాడు" కౌత్సుడు "వచ్చిన పని ఏమిటో చెప్పకుండా తిరిగి వెళ్ళిపోవుట మంచి పని కాదు; ఏమి కావాలో కోరుకొమ్మని" ప్రార్థించాడు రఘుమహారాజు. సందేహిస్తూనే వచ్చిన పని నెమ్మదిగా వివరించాడు కౌత్సుడు

## తేడా

జీవనదుల్లో నివసించే చేపకు తెలుసు
మానవ జీవితంలోని సుఖదుఃఖాలు
అందుకే అది ఈ మానవులకు
దూరంగా నదుల్లో ఈదుతోంది.
నీలాకాశంలో ఎగిరే పక్షికి తెలుసు
మనుషుల్లోని అనుబంధాలు శృంఖలీలు
అందుకే అది బంధాన్ని త్రెంచుకొని
దూరంగా ఒంటరిగా ఎగురుతోంది.
అడవిలో జంతువుకి తెలుసు
మనుషుల్లోని ఈర్ష్యాక్రోధాలు
అందుకే అది రాక్షసత్వానికి
దూరంగా పోయి ఆనందిస్తోంది
శాంతి లోని నిర్మలత్వాన్ని చూచి.
ఆదరించే హృదయం లేదని యెంచి
శాంతిదూత ఎగరేసిన పావురం
మనుషులమధ్య ఉండలేక ఏటో ఎగిరి
పోయింది.

- కె. యస్సార్. రెడ్డి

"నా దగ్గరున్న ధనమంతయు పంచి యిచ్చితిని. ఇక మిగిలింది ఏమీ లేదు. రెండు రోజులు మా అతిథి గృహంలో విశ్రాంతి తీసుకోండి మీరు కోరింది తెచ్చి యిస్తాను" అన్నాడు రఘుమహారాజు.

"ఇంత ధనము ఎవరి వద్ద ఉంటుంది? భూమండలంలో ఉన్న రాజులంతరూ తన చేత జయింపబడిన వారే. వారి వద్ద నున్న సంపదలన్నీ తానిచ్చినవే. ఇంక మిగిలినవారు దేవతలు. వారిలో ధనపతి కుబేరుడు. అతనిపై దండెత్తుతాను" అని అనుకొని, ఆనాటి రాత్రే రథము సిద్ధం చేసి, ఉదయమున ప్రయాణమునకు సిద్ధపడి, ఆ రాత్రి రథమునందు విశ్రమించాడు రఘుమహారాజు.

తనపై రఘుమహారాజు దండెత్తుటకు వస్తున్నాడని కుబేరుడు విని భయపడ్డాడు తనకు అపజయము తప్పదనుకొన్నాడు. యుద్ధం చేసి ఓడిపోయే కంటే ముందుగానే అతని ఉద్దేశ్యం తెలుసుకొని నెరవేర్చడం మంచిదనుకొన్నాడు సంగతి తెలుసుకొన్నాడు. వెంటనే రఘుమహారాజు కోశాగారాన్ని ధనరాసులతో నింపివేశాడు కుబేరుడు రాసులుగా పడుచున్న ధనము చప్పుడు విని కావలివారు విషయాన్ని రఘుమహారాజుకు తెలియజేశారు. మహారాజు స్వయంగా వెళ్ళి ధనరాసులను చూచి, దానమిచ్చుటకై కౌత్సుని రప్పించాడు.

"గురువు అడిగినదానికన్న ఒక్క కాసైనా ఎక్కువగా తీసుకోనని" కౌత్సుడు అన్నాడు. "నీకొరకై ప్రయత్నించగా లభ్యమైంది. కనుక ఇది అంతా నీదే" అన్నాడు రఘుమహారాజు. చివరకు కౌత్సుని ఒప్పించి ధనమును గుఱ్ఱములకెత్తించి, సాగనంపాడు రఘుమహారాజు.

శిష్యుడు ఎంతకు తిరిగి రానందుకు గురుపత్ని కుములుచు, కంట నీరు పెట్టుకొన్నది. గురుని మనస్సు కూడా ఆందోళన చెందింది ఇంతలో దూరం నుండి గుఱ్ఱముల డెక్కల చప్పుడు వినిపించింది. శిష్యుడు ధనరాశిని తెచ్చి, గురు దక్షిణగా యిచ్చి, గురు పాదాలకు సాష్టాంగదండప్రణామము అర్పించినాడు. ఆనంద బాష్పాలతో శిష్యుని లేవనెత్తి, హృదయమునకు హత్తుకొన్నాడు వరతంతు మహర్షి.

# కాశ్యప మహర్షి

-పురాణపండ " శ్రీచిత్ర

కాశ్యపుడు కశ్యపుని వంశమున జన్మించినవాడు మహనీయుడు. తాపసి, కరుణామయుడు, మీదు మిక్కిలి అపారభూత దయ గలవాడు. ఆ కాలమందు లోకములో పాముల బాధ అధికముగా ఉండెడిది. ప్రజలను పాముల బాధనుండి రక్షించాలనే తలంపుతో కాశ్యపుడు దీక్ష బూని తపస్సు ప్రారంభించాడు. కాశ్యపుని తపస్సుకు బ్రహ్మ మెచ్చి ప్రత్యక్షమై "కాశ్యపా! లోకహితార్థమై చేయు నీ తపస్సునకు సంతోషించితిని. నేటినుండి పాము విషముచే మరణించినవారిని నీవు బ్రతికించగలవు" అని పలికి అదృశ్యమయ్యాడు. బ్రహ్మ వరప్రభావంతో కాశ్యపుడు పాములబారినుండి ప్రజలను రక్షింపసాగాడు.

పూర్వం శృంగిమహర్షి పరీక్షిత్తను రాజును పాము కాటుచే మరణింతువని శపించాడు ఇక ఏడు దినములే వ్యవధి ఉన్నది. పరీక్షిత్తు ధర్మప్రభువు. అతడు మరణించిన ఆ రాజ్యమునకు కీడు తప్పదని భావించి. ఆ రాజును బ్రతికించే ఉద్దేశ్యంతో హస్తిపురికి బయలు దేరాడు కాశ్యపుడు. దారిలో తక్షకుడు బ్రాహ్మణ రూపం దాల్చి కాశ్యపుని కలుసుకొని "మునీంద్రా! నీ ప్రయత్నం వృధా సుమా! నేనే తక్షకుడను. నా విషాగ్నిముందు నీ మంత్రతంత్రములు పనికిరావు. నా విషాగ్ని జ్వాలలచే ఈ మఱ్ఱిచెట్టును సర్వనాశనం చేస్తాను, నీకు శక్తి యున్న బ్రతికించు" అని పలికి ఎదురుగా వున్న మఱ్ఱిచెట్టును బూడిద పాలు చేశాడు. అంత కాశ్యపుడు ఆ బూడిదను తన మంత్రమహిమచే మరల యధాతధంగా చేశాడు. తక్షకుడు కాశ్యపుని శక్తిని చూచి ఆశ్చర్యపడి "మునీంద్రా! ముని శాపమునకు తిరుగుండదు గదా! (పరీక్షిత్తును శపించినది శృంగమహర్షే గదా) కనుక నీవు వెనుదిరిగి వెళ్ళటం న్యాయము" అని నచ్చజెప్పగా, అందుకు సమ్మతించి కాశ్యపుడు వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

కాశ్యపుడు ఒక పరమసిద్ధునివద్ద పరతత్త్వమును గ్రహించి, బ్రహ్మ విద్యా రహస్యములు తెలిసికొని బ్రహ్మర్షి శేఖరుడయ్యాడు. స్మృతి కర్తలలో కాశ్యపుడు ఒకడుగా పరిగణింపబడ్డాడు. ప్రతినిత్యం కాశ్యపుని స్మరించువారికి సర్పభయం ఉండదు. సర్పములుకూడా అట్టివానిని ఏమియూ చేయవు. ఇది త్రికాలాబాధ్యమాన మైన సత్యం. కాశ్యపుడు ప్రాతః స్మరణీయుడు, లోకోపకారి, దయామయుడు. ◯

## చందాదారులకు మనవి

* తమ చందాలను కనీసం ఒక నెల ముందుగా రెన్యూవల్ చేయవలెను.
* తమ చందాను రెన్యూవల్ చేయదలచనివారు కనీసం ఒక నెల ముందుగా తెలియపరచవలెను.
* చిరునామా మార్పు కావాలని కోరేవారు విధిగా తమ చందా నెంబరును పేర్కొంటూ పాత చిరునామా మరియు క్రొత్త చిరునామా వివరంగా పేర్కొనవలెను.

# కౌమారగీతి

లేఖలు

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 28-11-1978

చిరంజీవులకు – ఆశీస్సులు

విద్యయొక్క ప్రాముఖ్యతను గురించి, గొప్పతనాన్ని గురించి ఇప్పటికి మూడు లేఖలు వ్రాసాను విద్యయొక్క ఔన్నత్యాన్ని గురించి మరికొన్ని ముఖ్య విషయాలను ఈ ఉత్తరంలో వ్రాస్తున్నాను.

" రూపయౌవన సంపన్నా
విశుద్ధ కుల సంభవాః
విద్యాహీనా న శోభన్తే
నిర్గంధా ఇవ కింశుకాః "

అనగా "విద్య లేనివారు, మంచి రూపము యౌవనము కలిగియున్నప్పటికినీ, గొప్ప వంశమునందు జన్మించినప్పటికినీ, వాసన లేని మోదుగుపూవువలె శోభించరు" అని అర్థము.

హితోపదేశమునందు ఈ నీతిశ్లోకము చక్కగా ఉపమాన సహితంగా వివరించబడింది. మోదుగుపూవు చూడటానికి చక్కగా అందంగా వుంటుంది. కాని సువాసన ఏమాత్రం ఉండదు. వాసన లేని పూవును సహజంగా ఎవ్వరూ కోరరు. దండలలో గుచ్చరు. స్త్రీలు పెట్టుకొనరు, దాని బ్రతుకు అడవిన గాచిన వెన్నెలలాంటిదే అవుతుంది. అదేవిధంగా మేడిపండు కూడా పైకి చూడటానికి నిగనిగలాడుతుంటుంది పొట్ట తెరచి చూస్తే పురుగులుంటాయి. అటువంటి పండును ఎవ్వరూ తినరు గదా! పొట్ట కోస్తే అక్షరం కూడా కనిపించదంటారు కొంతమంది మొద్దులను చూచి. అటువంటివారిని ఎవరూ గౌరవించరు. కొంతమంది పైకి చూడటానికి మంచి అందంగా కనిపిస్తారు రూపం ఆకర్షణీయంగా ఉంటుంది దానికితోడు మంచి యౌవనం అనగా మిసమిసలాడే వయస్సుకూడా వుంటే అతనికి పట్టపగ్గాలే వుండవు ఈ రెంటికితోడు ఉన్నతమైన పేరుప్రతిష్టలు కలిగిన వంశములో జన్మించితే ఇంకా వేరే చెప్పనవసరంలేదు. వీటికితోడు సిరిసంపదలుగల వంశమున జన్మించిన భాగ్యశాలి అయితే అతను ఎవరినీ లెక్కచేయడు. ఇన్ని విశేషమైన లక్షణములు ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పటికీ, అసలు కావలసిన విద్య అతనిలో లేకపోతే అతను సమాజంలో ఏమాత్రం శోభించడు, రాణించడు, ప్రకాశించడు, చెలామణి కాడు. ఇన్ని విశేష లక్షణాలున్నప్పటికీ పొట్ట కోస్తే అక్షరం లేకపోతే ఏం ప్రయోజనం? మేడిపండును ఏ విధంగా విసిరిపారవేస్తారో, మోదుగ పూవును ఏ విధముగా దరికి చేరనివ్వరో, మంచి రూపము, యౌవనము ఉండి ఉన్నతమైన గొప్ప కులమునందు జన్మించినప్పటికినీ, ఒకవేళ 'డొక్క శుద్ధి' లేనివానిని ఎవరూ దరికి చేరనివ్వరు. గౌరవించరు ఈ శ్లోకంద్వారా మనం నేర్చుకోవలసిన నీతి ఒక్కటే. మానవునికి ముఖ్యం పైపై మెరుగులు మాత్రమే కావు. బాహ్యసౌందర్యమే గాక, అంతఃసౌందర్యమగు మంచి విద్యకూడా వున్నవానినే పదిమంది ప్రేమిస్తారు, గౌరవిస్తారు అనే విషయం విస్మరించరాదు. విద్య లేనివారు ఎందుకూ కొరగారు. ఈ నగ్నసత్యాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాలి.

రాజు కన్నా విద్వాంసుడే ఎన్నో రెట్లు మిన్న అని సమస్త దేశములలో పూజింపబడేవాడు ఒక్క విద్వాం

సుడే నని ఈ క్రింది శ్లోకం తేటతెల్లం జేస్తున్నది.

"విద్వత్వం చ నృపత్వం చ
నైవతుల్యం కదాచన
స్వదేశే పూజ్యతేరాజా
విద్వాన్ సర్వత్ర పూజ్యతే"

అనగా "పాండిత్యమయును, రాచరికముయును ఎన్నడూనూ సమానమైనవి కానే కావు. రాజు తన దేశమునందే పూజింపబడుతున్నాడు. విద్వాంసుడు మాత్రం అన్ని దేశములయందునూ పూజింపబడుతున్నాడు. అని అర్థము. దీనిబట్టి అధికారదండం చేబూనిన రాజుకన్నా, పాండిత్యం గల విద్వాంసునికే సమాజం ఎంతో విలువ యిస్తుందని తేటతెల్లమవుతున్నది. పండితుడనగా ఇక్కడ కేవలం కావ్య, శాస్త్ర, సాహిత్య పరిజ్ఞానం కలవాడని మాత్రమే చెప్పుకుంటే సరిపోదు. పారమార్థిక అనుభవ జ్ఞానము, లౌకిక జ్ఞానము, ఆత్మ జ్ఞానము కలవాడని గమనించాలి. సామాన్యముగా పండితుడనగానే పాండిత్యమునందు మంచి ప్రవేశం కలవాడని, సాహిత్యమునందు మంచి కౌశలము గలవాడని, శాస్త్రవిషయములయందు మంచి పరిజ్ఞానం గలవాడని, సహజంగా ప్రజలు భావిస్తుంటారు కాని భగవద్గీతలో "పండితుడనగా ఎవరికొఱకు, దేనికొఱకు దుఃఖింపనివాడని, సమస్త చరాచర ప్రాణికోటియందు సమభావము గలవాడని, పరోపకారమే పరమావధిగా భావించి, మానవసేవే — మాధవసేవ యని తలంచి, నిరంతరమూ సమాజసేవలో నిమగ్నుడై, నిస్వార్థ బుద్ధితో వ్యవహరించే మహాత్ముడు" అని చెప్పబడింది. కనుక మనం యిక్కడ మాత్రం కావ్య, శాస్త్ర, సాహిత్య పరిజ్ఞానంతోపాటు, భగవద్గీతలో చెప్పబడిన మహాత్ముని లక్షణములను కూడా అలవరచుకొని సమాజాభివృద్ధికి తోడ్పడటం మన కర్తవ్యం. అటువంటి పరమోత్కృష్టమైన శక్తిని సముపార్జించిన విద్వాంసుడు, లేక పండితుడు, రాజుకన్నా గొప్పవాడని భావించడంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. అటువంటి

## ప్రశ్నలు - సమాధానాలు

1. ఆంధ్రులను గూర్చి వివరించిన తొలివిదేశీ గ్రంథం ఏది ?
2. "లీలావతి పరిణయం" అన్న గ్రంథమును రచించినది ఎవరు ?
3. "నృత్య రత్నావళి" రచించినదెవరు ?
4. "ఎయిరిండియా" కొత్త చిహ్నం ఏది ?
5. ఇన్‌శాట్ - 1B స్థానంలో ప్రవేశ పెట్టిన ఉపగ్రహం ఏది ?
6. విశాఖ ఉక్కు కర్మాగారం ఎవరి సహకారంతో నిర్మింప బడింది ?
7. భారత నావికా దళం కోసం హిందుస్తాన్ షిప్‌యార్డులో నిర్మించిన షిప్ టాంక్ పేరు ఏమిటి ?
8. ఇండియా మొదటి అణుపరీక్ష ఎప్పుడు ఎక్కడ జరిగింది ?
9. భారత దేశంలో స్థాపించిన మొదటి అణు కేంద్రం ?

1.) ఇండిక 2.) కుతూహాలుడు 3.) జయప సేనాని 4.) సూర్యుడు 5.) ఇన్‌శాట్ - 1D 6.) సోవియట్ యునియన్ 7.) 18-5-1974 పోఖ్రాన్ (రాజస్థాన్)లో 9.) తారాపూర్ (మహారాష్ట్ర) - 1969

మహాశక్తి సంపన్నుడైన పండితుడు, అన్ని దేశములలో సహజంగా గౌరవించబడి, పూజింపబడుతాడంటే ఏమాత్రం ఆశ్చర్యపడనవసరంలేదు. కనుక అట్టి ఉత్తమ స్థితికి చేరుకోవటానికి ప్రతి విద్యార్థి,విద్యార్థినీ కృషి చేయాలి. ఇదే నా ఆశయం. ఇక ఉంటా...

ఇట్లు
"మీ నాన్న"

# నారద భక్తి సూత్రాలు-30

# సోపానపాళి

'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

ధర్మసందేహాలు కలిగినపుడు పండిత వచనాలేకాక ఆత్మజ్ఞానంతో సదాసద్వివేకంతో ప్రవర్తించాలి అని బోధించే ఒక కథ ఉంది.

ఒక అడవిలో ఒక మునీశ్వరుడు ఆశ్రమం ముందు కూర్చుని జపం చేసుకుంటున్నాడు. ఇంతలో ఒక లేడి ప్రాణాతురయై అటువైపు ముని ముందుగా ఆశ్రమం వెనుకకు వెళ్ళింది. ఇంక కొంచెం సేపటికి ఒక వేటగాడు వచ్చి లేడి కనిపించక పోయేసరికి మునిని చూచి 'అయ్యా! ఇటు లేడి వచ్చింది. చూచారా! ఎటు వెళ్ళింది?' అని అడిగాడు.

మునికి ఇప్పుడు ధర్మ సందేహం వచ్చింది. లేడి వచ్చింది తాను చూచాడు. తాను చూడలేదంటే అసత్య దోషం తగులుతుంది. 'నేను చూచాను. లేడి ఆశ్రమం వెనుక వుంది' అంటే పాపం! లేడి పిల్ల ప్రాణం పోతుంది

ముని ఆలోచించాడు- కన్ను చూచింది పలుకలేదు. నాలుక పలుకుతుంది కానీ అది చూడలేదు ముని సూక్ష్మంగా యుక్తిగా ఇలా అన్నాడు.

"కిరాతకా! చూచినదానికి మాట్లాడే శక్తిలేదు. మాట్లాడే శక్తిగల దానికి చూచే శక్తిలేదు చూచినది చెప్పాలి. ఈ సగం సగం తెలివిగల వానివల్ల సత్యం తెలుసుకోలేవు" పొమ్మన్నాడు

మునితో వాదించే శక్తిలేక వాడు వెళ్ళిపోయినాడు. లేడి బ్రతికిపోయింది. మునికి అసత్య దోషం తొలిగింది. భక్తుడైన వాడు యిలా ఆలోచించి జీవన యానం చేయాలి.

శౌచం- శౌచం అంటే శారీరకంగాను మానసికంగాను, భక్తుడు శుచిగా ఉండాలి జలంతోను, ఓషధులతోను శరీరాన్ని పరిశుభ్రం చేసుకోవాలి శుభ్రవస్త్రాలు ధరించాలి భుజించే పదార్థం స్వశక్తి సంపాదనతో ప్రాప్తించినదై అన్యాక్రాంతం, అన్యాయార్జనం కానిదై ఉండాలి. పవిత్ర హృదయంతో హరికి నైవేద్యమైనవే భుజించాలి. సాత్త్విక ఆహారం వలన మనస్సు నిర్మలమవుతుంది. భక్తుడు అతిథి సత్కారాలతో భగవద్భజనలతో గృహం పవిత్రం చేసుకోవాలి. ప్రశాంత వాతావరణం ఏర్పాటు చేసుకోవాలి.

మానసికశుచి- భక్తుడు కామక్రోధాదులు మనస్సులోనికి రానీయరాదు. విషయవాసనలకు దంభ వైరాదులకు మనస్సును దూరంగా ఉంచాలి. ప్రేమ, క్షమ, సంతోషం, సచ్చింతనం, వినయం, ప్రసన్నత, వైరాగ్యం, ఆరోగ్యం, అలవరచుకొని మనస్సును పవిత్రంగా ఉంచుకోవాలి. మంత్ర ప్రాయశ్చిత్తం అవసరం అయినప్పుడు జరుపుకోవాలి.

శుచి లేనివానికి పవిత్ర వస్తువులు కనిపించవు. ఉదంకుడు అభక్ష్య భక్షణం చేసి శుచిమంతుడు కాలేకపోయాడు. అశుచిగా రాజాంతఃపురంలోనికి వెళ్ళటం వల్ల మహాపతివ్రతయైన రాణిని చూడలేకపోయాడు. ఉదంకుడు మరల వెనుకకు వెళ్ళి రాజుతో 'రాజా! నీవు వెళ్ళి రాణిగారిని అడిగి రత్నకుండలాలు తెచ్చుకోమన్నావు. అక్కడ రాణిగారే లేరే! అబద్ధం ఆడతావా' అన్నాడు. రాజు ఆలోచించి నీవు అశుచివై ఉన్నావు. శుచిర్భూతులకే మహారాణి దర్శనం

అవుతుంది అంటాడు. అపుడు ఉదంకుడు పవిత్ర జలాలతో ఆచమించి మంత్రం జపించి శుచియై వెళ్ళి రాణిని అడిగి కుండలాలు తెచ్చుకొని గురుపత్నికి గురు దక్షిణగా సమర్పించుకొంటాడు.

శౌచం ప్రభావం యిలా ఉంటుంది. కలి శుచి కానివానిని ఆవహిస్తాడు, ఎట్టివానినైన ధర్మచ్యుతుని చేసాడు.

నల చక్రవర్తి దమయంతిని వివాహమాడి ధర్మం నాల్గు పాదాల నడిచేలాగా రాజ్యం చేస్తున్నాడు ఒకనాడు పొరపాటున రాజు అశుచి కాగా అతనిని కలి ఆవహించాడు. ఫలితంగా కష్టాలు చుట్టు ముట్టాయి జూదంలో ఓటమి, రాజ్యంపోవటం, అడవిలో ఉగచాట్లూ, ఆకలికై అలమటించటం, ఉత్తరీయం కూడా పక్షులెత్తుక పోవటం, వస్త్రహీనుడై భార్య చీర కొంత చించుకొని ధరించి తాను భార్యను విడిచిపోవటం, పాము వాతపడి వికృతరూపుడు కావటం, మరో రాజువద్ద వంటవాడై ఊడిగం చేయటం, వంటి అనేక కష్టాలు సంభవించాయి. శుచి కాని దోషం ఎంత పని చేస్తుందో చూచారా! కావున భక్తుడు ఎల్లప్పుడు శౌచాన్ని జాగరూకుడై పాటించాలి.

దయ– దయ హృదయ సంబంధి. సహృదయులకు దయ, కరుణ, ప్రేమ సహజగుణాలు ఇవి రత్న భూషణాలు. ప్రేమభావంతో నిస్వార్థ భావంతో మాధవసేవ భావంతో దీనులను దుఃఖితులను స్వపర భేదం లేకుండా మిత్రు శత్రుభావం వీడి సకల ప్రాణు లను ఆదుకోవాలి.

రంతిదేవుడు అతిథి పూజకు, దయాగుణానికి పెట్టింది పేరు మితిమీరిన దానధర్మాలతో, దీన మానవ సేవతో అతడు దరిద్రుడైపోయాడు నలుబదిరోజుల తరువాత ఒకరోజు లభించిన భోజనం చేయబోయేసరికి ఒక బ్రాహ్మణుడు ఆకలితో ఆహారాన్ని అర్థించగా వానికి రాజు తనకున్న దానిలో సగం పెట్టాడు. ఇంతలో మరొకడు వచ్చి ఆకలి అన్నాడు. రాజు మిగిలిన దానిలో సగం అతనికి పెట్టాడు. ఆ కాస్త తిందాము అనుకొనే సమయంలో కుక్కలను తోలుకొని మరొకడు వచ్చి ఆకలి ప్రభో! అన్నాడు. ఉన్న అన్నం అంతా పెట్టి వాని ఆకలి బాపి పంపాడు రంతిదేవుడు.

ఇక రాజకుటుంబానికి మిగిలినవి మంచినీళ్లు. పోనీ నీళ్ళతో కడుపు నింపుకుందాం అనుకొనేటంతలో ఒక చండాలుడు వచ్చి మంచి తీర్థమైనా పోసి ప్రాణం నిలపండి అన్నాడు. దయతో రాజు హృదయం కరిగి పోయింది. ఆ రంతిదేవుని మాటలివి–

అన్నము లేదు కొన్ని మధురాంబువు
లున్నవి త్రావుమన్న! రా
వన్న శరీర ధారులకు నాపదవచ్చిన
వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు
సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు– పురుషోత్తము
డొక్కడె చుమ్ము పుల్కసా!
బలవంతం బగునీరుపట్టున
నిజప్రాణాంతమైయున్న చో
నలయం జేమియు వీనిహృజ్జ్వరము
నాయాసంబు ఖేదంబు నా
జలదానంబున నేడు మాను ననుచున్
సర్వేశ్వరాధీను డై
జలమున్ బోసెను రంతి దేవుడు దయన్
జండాల ప్రాత్రంబునన్

ఆపదలు వచ్చినపుడు వారిని ఆదుకొన్నవాడే మహా భక్తుడు సర్వేశ్వరాధీనుడై భక్తితో కులమత భేదం పాటించకుండ అవన్నులకు ప్రాణదానం చేయాలి. రంతిదేవుడు తన యోగక్షేమం భగవంతునిపై వదలి దయతో ఆకలి గొన్నవారిని ఆదుకున్నాడు

# మీకు తెలుసా ?

రూపాంతరనామాలు అంటే ఇంగ్లీషులో Sobriquets అంటారు. ప్రపంచంలో కొన్ని ప్రదేశాలకి కొన్ని రూపాంతర నామాలు ఉన్నాయి. మొదటగా ఇండియాని పరిశీలించి నట్లయితే—

అమృతసర్‌ని - సిటీ ఆఫ్ ది గోల్డెన్ టెంపు అంటారు. అదేవిధంగా మరికొన్ని :-

కలకత్తా - సిటీ ఆఫ్ ప్యాలెస్
బెంగుళూరు - గార్డెన్ ఆఫ్ ఇండియా
కేరళ - స్పైస్ గార్డెన్ ఆఫ్ ఇండియా
పంజాబ్ - ల్యాండ్ ఆఫ్ రివర్స్
బొంబాయి - గేట్ వే ఆఫ్ ఇండియా
నీలగిరికొండలు - బ్లూ మౌంటెన్స్
తెనాలి - ఆంధ్రాప్యారిస్

ఈ విధంగా మన భారతదేశంలో ఎన్నో రకాలయిన పేర్లు వాటియొక్క భౌగోళిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులకి అనుగుణంగా ఆయా పేర్లు వస్తూ ఉంటాయి.

చేతులారంగ శివుని పూజింపదేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువ డేని
దయయు సత్యంబు లోనుగా తలప డేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు

అని మానవులు హరి భక్తితో పాటు, దయ కలిగి ఉండాలి అని పోతనామాత్యుడు నొక్కి వక్కాణించాడు.

ఆస్తిక్యం— భక్తుడు భగవంతుణ్ణి పూర్తిగా విశ్వసించాలి భగవంతుడు సర్వశక్తిమయుడు, సర్వస్వామి, సర్వాంతర్యామి. ఆయన పరమ కారుణ్యమూర్తి, దీన బాంధవుడు అందరినీ ఆపదలలో ఆదుకుంటాడు. పాపపంకిలాన్ని తన దయామృతంతో కడిగి వేస్తాడు. అనే విశ్వాసం భక్తుడైన వానికి ఉండాలి. భగవంతుడు ప్రపంచ సృష్టి స్థితిలయకారుడు, అనంతుడు, అనంత రూపుడు, సహస్రాక్షుడు సహస్రశీర్షుడు, సహస్రపాదుడు, విశ్వమయుడు- అని ప్రహ్లాదుని వలె విశ్వసించాలి.

ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపుడు ఎంతగానో బాధించాడు. దుర్బోధలు గావించాడు పాములచేత కరిపించినా కొండలనుండి త్రోయించినా ప్రహ్లాదునిలో భక్తి ప్రవృద్ధమైందేకాని సడలలేదు. ప్రహ్లాదుడు తండ్రితో అంటాడు.

విష్ణుః శస్త్రేషు యుష్మాసు
మయు చాసౌ వ్యవస్థితః
దైతేయాస్తేన సత్యేన
మాక్రమంత్వాయుధాని చ

తండ్రీ! విష్ణుమూర్తి శస్త్రాలలో నీలో నాలో సర్వత్ర ఉన్నాడు. అందువల్ల నీ శస్త్రాలు నాపైబడి కూడా హానిచేయటంలేదు. నా మాటపై నమ్మకముంచి వింటే చక్రి సర్వప్రదేశాలలోను, సకల ప్రాణుల లోను, సమస్త వస్తువులలోను నిండి ఉంటాడు. అని అంటాడు ప్రహ్లాదుడు ఆ బాలభక్తుడు హిరణ్యకశిపునికి సర్వేశ్వరుణ్ణి స్తంభంలో చూపించాడు. నరసింహస్వామిని అర్థించి తండ్రికి అపవర్గ సౌఖ్యం కల్గించాడు. ప్రహ్లాదుడు భగవంతునిపై చూపిన భక్తి విశ్వాసాలే భక్తులకు ఆదర్శప్రాయం.

కల డంభోధి గలండుగాలి
గలడాకాశంబునన్ కుంభినిన్
గల డగ్నిన్ దిశలన్ పగళ్ళ నిశలన్
ఖద్యోత చంద్రాత్మలన్
గల డోంకారమునన్ త్రిమూర్తుల
త్రిలింగవ్యక్తులం దంతటన్
గల డీశుండు గలండు తండ్రి!
వెదకంగా నేల! ఈయాయెడన్ 

# జాతీయత ఆధ్యాత్మికత మేళవించిన కవి రాఘవశర్మ

-కంచి వాసు దేవ రావు

మహాత్మాగాంధీ నాయకత్వ ప్రభావం ఎటువంటిదో కాని పూర్వాచార సంపన్నులు, పరమ నైష్ఠికులైనవారు కూడా ఎందరో సామాన్య మానవుల మాదిరి స్వాతంత్రోద్యమ సంగ్రామంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళారు. గాంధేయ సిద్ధాంతాల ప్రచారానికి తమ జీవితాన్ని తమ సర్వస్వాన్ని అంకితం చేశారు అట్టి వారిలో గురజాడ రాఘవశర్మగారొకరు. ఆయన గొప్ప జాతీయాభిమాని, దేశభక్తుడు, కవి, జ్యోతిషశాస్త్రవేత్త.

స్వాతంత్ర్యోద్యమసందర్భంగా ఆయనపై బందరు జిల్లాకోర్టులో కేసు నడుస్తున్నప్పుడు - పద్యరూపంలో తన గురించి వాదించుకున్నారని ఆయన సమకాలికులు చెప్పగా విన్నాను ఆయన విలక్షణ విశిష్ట వ్యక్తిత్వం స్వయంగా నాకుకూడా కొంతవరకు తెలుసు కనుక అది నిజమే కావచ్చునని అభిప్రాయపడ్తున్నాను. ఆయన ఎంత జాతీయవాదో అంతగా కవి - సాంప్రదాయ చంధోబద్ధ కవిత్వాన్ని స్వీకరించిన కవి. ఆయన కవిత్వం సామాజిక స్పృహతో కూడుకుని వుంటుంది. ఆనాటి ఉద్యమాలకు ప్రతిస్పందన ఆయన కవిత్వంలో స్పష్టంగా కన్పిస్తుంది.

మహాత్మాగాంధి హరిజన ఉద్ధరణకు మద్యపాన విషేధానికి తన జీవితాన్ని ధారపోసారు. మహాత్మాగాంధి ఆదర్శాలకు బద్ధుడైన రాఘవశర్మగారు మద్య విషేధంపై రాసిన సీస పద్యాలు " త్రాగుడు పిశాచమా ఇక తరలిపొమ్మ " అనే మకుటంతో గ్రంధస్తమయ్యాడు.

మొగలాయి పాదుషాల గులాములుగ జేసి
స్వైరవిహారమ్ము సల్పినావు
సంపదోన్నత రాజకిరీటములడించి
శీఘ్రగా నాటకాలాడించినావు
ఆంగ్లేయ దేశ మర్యాద మర్యాద య
టంచు మాయింటి పాలించినావు
లాలించి పేదల రక్తమాంసమ్ముల
ద్రావి తాండవరూపు దాల్చినావు.
ఎంత మాయాస్వరూపిణి విపుడు దెలిసె
వౌర నీ గుట్టు : మా పొలిమేర విడచి
వెడలు మిటనుండి యింత త్రాగుడు
పిశాచమ, నిశాచర పెనుభూతమ్మ వెడలుము.

పర ప్రభుత్వం కింద పడియుండుటన్ జాలి
విన్ సాగనంపగ నీరదయ్యె
చిర దాస్యమున జిక్కి దెశావమి కన్నులు
విన్ రూపుమాపగా నీరదయ్యె
పెద్దల మాటల పెడచెవినా బెట్టుటన్
నీ ద్రోహ మెరుగగా నీరదైరి
దేశ దారిద్ర్య విధినా నీ స్వభావమ్ము
ఎంత చెప్పిన తలకెక్కవయ్యె
ఇప్పుడు స్వాతంత్ర్యమున్ గడియించినారు
భరతఖండాన విల్వగా పాడి
కదలు మిటనుండి యాశల వదలుమింక
త్రాగుడు పిశాచమా ! యింక తరలిపొమ్మ ॥

అని రాఘవశర్మగారు రాశారు. కాని ఈనాడు భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 45 సంవత్సరాలు దాటినా

త్రాగుడు పిశాచము తరలిపోకపోగా మరింత బలపడి ప్రజల జవసత్వాలను ఆర్థికశక్తిని హరింపచేస్తోంది. ఆనాడు మహాత్మాగాంధి యిచ్చిన స్ఫూర్తి మాదిరి యిప్పుడు మహిళలు ఆదిశక్తులై తాగుడు పిశాచాన్ని తరమికొట్టచూస్తున్నారు.

1930 ఉప్పు సత్యాగ్రహ సందర్భంగా జైలుకు వెళ్లారు. దాదాపు ఇరవయ్యవ యేటనుంచే అంటే 1921 నుంచి మహాత్మాగాంధి నిర్వహించిన అన్ని జాతీయోద్యమాలలో పాల్గొన్నారు. ఖాదీ ప్రచారకులుగా అనేక సంవత్సరాలు అకుంఠిత దీక్షతో పనిచేశారు.

రాఘవశర్మగారు వస్తుతః కవి. ఆయన రాజకీయ నాయకుడికన్న, జాతీయవాదికన్న ఎక్కువ ప్రాచుర్యం పొందారు. ఆయన రచించిన అనేక కావ్యాలు మద్రాస్ ఆంధ్ర, వెంకటేశ్వర, మైసూర్ ఉత్కళ విశ్వవిద్యాలయాలలో బి. ఎ. విద్యార్థులకు పాఠ్యగ్రంథాలుగా ఎంపిక కావడమే ఆయన కవితా ప్రతిభకు నిదర్శనం.

ఆయనపై మొదట్లో తిరుపతి వెంకట కవులు వంటి జంటకవులు, వారి అష్టావధానాల ప్రభావం పడింది. ఆంధ్రదేశంలో అటువంటి జంటకవులు చాలామంది వెలిసారు. వారిలో పింగళి, కాటూరి సుప్రసిద్ధులు జంటకవులుగా ఎక్కువకాలం కొనసాగకపోయినా - కొందరు తమ కవితా వ్యవసాయ ప్రారంభంలో అటువంటి ఉత్సాహమే చూపారు. విశ్వనాథ సత్యనారాయణగారు, కొడాలి ఆంజనేయులుగారు సత్యాంజనేయ కవులుగా కవిత్వ సాధన చేశారు. బందరు వాస్తవ్యులు పువ్వాడ శేషగిరిరావుగారు, చోడవరపు జానకిరామయ్యగారు జంట కవితాసాధన చేశారు. ఆదేవిధంగా రాఘవశర్మగారు, వెణుతురుమిల్లి సత్యనారాయణగారితో కలసి కవితాసాధన ప్రారంభించారు దేశవిభజన సమయంలో హిందూ ముస్లిం మతకలహాలు అనేకమంది భారతీయుల మాదిరిగానే రాఘవశర్మగారిని కలచివేసాయి. ఆ మనోవేదననుంచి ప్రభవించిన కావ్యమే నాకవి ఐతే వీరు కవిగా పరాకాష్ట పొందినది కల్పలత అని విమర్శకులు అంటారు ఇది అనేక విశ్వవిద్యాలయాలకు పాఠ్య గ్రంథంగా ఎంపిక అయింది.

రాఘవశర్మగారు అంతర్ముఖుడు, ముముక్షువు, భక్తి తత్పరుడు వాసుదేవ నామశతకం, ముకుందమాలతో రాఘవశర్మగారు భక్త కవులలో చోటుచేసుకున్నారు. ఆయన అనేక సంవత్సరాలపాటు మచిలీపట్టణం అనధికార ఆస్థానకవిగా రాణించారు. ఏ ప్రముఖుని సన్మానం జరిగినా ఏ ప్రధాన సంఘటన జరిగినా రాఘవ శర్మగారి కవితా పన్నీటిజల్లులు సభపై కురువవలసిందే.

ఆయన షష్ఠిపూర్తి ఉత్సవాలు 1962 లో మచిలీ పట్నంలో జరిగినప్పుడు పింగళి లక్ష్మీకాంతంగారు “ మానసిక ప్రపంచానికి భక్తి సందేశాలనిచ్చి ముక్తికి దారిచూపిన కళాతపస్వి ” అని అన్నారు. పింగళివారి సహకవి అయిన కాటూరి వెంకటేశ్వరరావుగారు “ అతని కలుపుగోలుతనం నలుగురిలో తలలో నాలుకగా

సంచరించే ఆప్యాయత, పరోపకార ప్రవీణత మనసారా ప్రేమించి నోరార పలుకరించడం వీటన్నిటిని మించి స్ఫాటిక స్వచ్ఛమైన నైతల్యం అందరినీ పరవశుని చేసిన " వని అన్నారు.

రాఘవశర్మగారు గొప్ప అభిమానముతో తన ఆత్మ గౌరవానికి ఏమాత్రం భంగం కలిగించినా సహించేవారు కారు. తీవ్రంగా స్పందించేవారు ఆయన ఎంత మృదు స్వభావో అంత నిర్మొహమాటి. అవసరమనుకొంటే తను చెప్పదలచుకున్నది ఎంత కఠోర సత్యములయినా నిర్భయంగా చెప్పడం ఆయన ప్రవృత్తి. అందువల్లనే ఆయన అనేకమందికి శత్రువు అయ్యారు ఐతే మనసు అతి నిర్మలం. కల్లాకపటం ఎరుగని చిన్న పిల్లల మనస్తత్వం. "విందు మనసు నవ్య నవనీతతుల్యము పలుకులారుగా ఖండన శస్త్రతుల్య" మనే సూక్తి రాఘవశర్మగారికి పూర్తిగా వర్తిస్తుంది.

ఆయన జ్యోతిష శాస్త్ర ప్రవీణుడు ఈ విద్యవలన ఆయనకు అనేకమంది ప్రముఖ నాయకులు సన్నిహితులయి, అమిత గౌరవభావంతో చూచేవారు. వారి వద్ద వున్నన్ని ప్రముఖ నాయకుల జాతక చక్రాలు మరెవరి వద్దా వుండేవి కావని చెప్పుకునేవారు.

రాఘవశర్మగారు చివరిరోజులలో పూర్తిగా విరాగులై ఆధ్యాత్మిక జీవితానికే అంకితమయిపోయారు. బందరులోని సొంత యింటినే తపోవాటికగా చేసికొని జీవించారు. చివరకు ఆ తపస్సులోనే పండుటాకుగా తన ఆరాధ్య దైవమయిన వాసుదేవునిలో లీనమయి కైవల్యం పొందారు. నిష్కామచిత్తంతో జీవితాన్ని అనుభవించారు. నిష్కామిగా వెళ్ళిపోయారు – తన జీవిత స్మృతులను వారందరికీ పరిమితం చేసి వెళ్ళిపోయారు. నిజంగా ఆయన ధన్యజీవి. ○

## వార్ధక్యం

మానవ జీవన ప్రస్థానంలో
వార్ధక్యం ఒక శాపం!
ఎక్కుపెట్టిన విల్లులాంటి వయసు
కళ్ళముందే కరిగి పోతుంది!
వృద్ధాప్యం పులిలా వెంటబడి
మనిషిని వేటాకి వశపరచుకుంటుంది
పలకరించే తోడు లేక
కునారిల్లే దీపంలా
ముసలి జీవం మూలుగుతుంది!
కర్ణుని శాపంలా
పంచేంద్రియాలన్ని ఒక్కసారిగా
పనిచెయ్యమని మొరాయిస్తాయ్!
వయసులో ఉన్నన్నాళ్ళూ
బెల్లం చుట్టు ఈగల్లా మూగినవాళ్ళు
కసురుకుంటు కదిలిపోతుంటారు!
కొంగుపట్టుకు తిరిగిన కొడుకులుకూడా
దూరంగా జారుకుంటుంటారు!
వయసుండంగా వలపంతా ఒలకబోసిన
ఇల్లాలు
కస్సు బుస్సు మంటు కసురుకుంటుంది!
కాళ్ళల్లోనుండి జారుకుంటున్న బలాన్ని
కర్రతో ఎగదోసుకుంటు
కన్నీటి సముద్రాన్ని రెక్కలతో
ఈదుకుంటూ
మృత్యు శిఖరం వైపు దృష్టిని సారిస్తూ
కదిలిపోతుంటాడు సాయంకాలపు
సూర్యుడు!

-పాటిబండ్ల శ్రీమన్నారాయణ

# సాధకుడు - సాధన

-శ్రీ చంద్రశేఖరానందగిరిస్వామి

"లభంతే బ్రహ్మనిర్వాణం
ఋషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మానః
సర్వభూత హితేరతాః"

భగవంతుడు భగవద్గీతయందు ఈ మంత్రమున సాధకుడు సులభముగా భగవదనుభూతిని చెందు మార్గమును తెలుపుచున్నాడు.

**క్షీణ కల్మషాః :** మొట్టమొదట శాస్త్రమునందు చెప్పబడిన సత్కర్మానుష్ఠానములచే అంతఃకరణము వందలి మనస్సు నందలి కామాది సర్వ దోషముల నుండి దూరుడగును. అప్పుడతడు యతాత్ముడగును అనగా శరీర యింద్రియ మనస్సులు సంయమింపబడినవై తన పూర్వ స్వేచ్ఛాప్రవృత్తిని వదలగలుగును. శ్రీ బాబాగారు ఆదేశించినట్లు Watch your Words, Watch your Actions, Watch your Thoughts, Watch your Charactor, Watch your Habits అన్నట్లు సాధనచేత తను సర్వవిషయములను గమనించుచు అన్ని విషయములను పరిశుద్ధ మొనర్చి రజస్తమములనుండి దూరుడగును. అప్పుడతడు మహాత్ములద్వారా సత్యాసత్య విషయములను తెలిసి సత్యమును సత్యముగా అసత్యమును అసత్యముగా తెలిసి నిస్సంశయముగా తానెవడు? తనకు ఈ దృశ్యమగు దేహాది సమస్త ప్రపంచమునకుగల సంబంధము మిథ్యా సంబంధముగా తెలియును. దీని పరిణామమే సర్వభూతములందు దైవభావనచే తానే సర్వరూపముల నున్నవానివిగను, విశ్వము విష్ణువు కన్న, భగవంతుని కన్న అన్యము కాదనెడి అభేద దృష్టిచే అహింసకుడై తన త్రికరణములచే సర్వభూతములను ప్రేమించును, వాటి హితము కొరకే జీవించును. సమస్తమును సేవించును. ఈ విధముగ జీవితమును గడుపుచు బ్రహ్మనిర్వాణ స్థితిని మోక్షమును పొందును ఇట్టి సాధన సామగ్రిని సర్వులకు భగవంతుడు ప్రసాదించును గాక!

## దీనబంధు

పరమ పావనంబు పరమాత్మ తేజంబు
వాక్కులమృతంపువారి వాస్తవముగ
మేనులందు నేను మేల్కాంచి పులకించు
దివ్యప్రభల వెల్గు దీనబంధు!

మధురమైన సూక్తి మరపురాదు యెపుడు
వ్యథను బాపి యెదను సుధలు చిందు
సత్యసాయిబాబు సమరస తేజంబు
దివ్యప్రభల వెల్గు దీనబంధు!

ఘోర వ్యాధులెన్నో పారద్రోలుదునంట
కానరాని చోట్ల కాంతువంట
సాటి యెవరు నీకు సత్యసాయిప్రభో
దివ్యప్రభల వెల్గు దీనబంధు!

— గుడిసేవ నరసింహారావు

# గీత - అమృతవర్షిణి

-సాయి గంగామహాదేవ్

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్ ।
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥

- మనస్సుకు రెండు లక్షణము లుంటున్నవి. 1) చంచలత్వము. 2) అస్థిరత్వము. చంచలత్వము- అనగా, పద్ధతిలేని చలనమే చంచలత్వము. దీనినే సంకల్ప, వికల్పములని కూడా అన్నారు. ఇక అస్థిరత్వము - అనగా, మార్పుచెందునది అని ఒక అర్థము; జనన, మరణములు గలిగినటువంటిది అని మరియొక అర్థము. ఇట్టి అస్థిరము, చంచలము ఐన మనస్సునకు విషయాములే ఆహారము, ఇంద్రియములే పరికరములు. మనస్సు ఇంద్రియాదుల ద్వారా విషయాసక్తమైనప్పుడు జీవుడు ప్రకృతిలంపటుడౌతున్నాడు. కాబట్టి సాధకుడు స్వాత్మస్థితుడు కావాలన్నప్పుడు మనస్సును ఇంద్రియాదులద్వారా ప్రకృతిలో రమింప చేయకూడదు, దానిని విగ్రహించి ఆత్మయందు లీనం చేయాలి. ఒక చిన్న ఉదాహరణ -

సముద్రము ఏకము. దీనినుండి అనేక తరంగములు బయలుదేరుతున్నవి. తరంగములవలన సముద్రము + తరంగములు అనే వ్యవహారము బయల్దేరినది. ఇదే ద్వైతము. తిరిగి తరంగములను సముద్రములో లీనం ఇక ఏకత్వమైన సముద్రమే మిగులుతుంది. అట్లే ఆత్మ అనే సముద్రము నుండి మనస్సు అనే తరంగములు లేచినవి. ఇదే ద్వైతము. ఐతే తరంగములు కూడా సముద్రమే ఐనట్లు, మనస్సు కూడా ఆత్మస్వరూపమే. కనుకనే మనస్సు ఆత్మయందు లీనంకాగల్గుతున్నది

చంచలత్వ, అస్థిరత్వములు తరంగలక్షణములు, అచలత్వ, స్థిరత్వాదులు సముద్రలక్షణములు. కనుక అచలమైన, స్థిరమైన-దివ్యత్వం నొందటానికి తరంగములను (మనస్సును) సముద్రమునందు (ఆత్మయందు) లీనంచేయాలి. ప్రకృతిలో; పృధివి పృధివిలోపల, గాలి, గాలిలోపల, జలం జలంలోపల అగ్ని, అగ్నిలోపల ఆకాశం, ఆకాశంలోపలనే ఐక్యం కాగల్గుతుంది. అట్లే మనస్సు ఆత్మయందు లీనం కాగల్గుతున్నది అంటే ఈ మనస్సు కూడా ఆత్మపదార్థమేనని అవగతమౌతున్నది.

కనుక ఆత్మపదార్థమైన మనస్సు ఆత్మనేవాంఛించాలి కానీ, అన్యాన్ని వాంఛించరాదు. మనస్సు ఆత్మను వాంఛించుటయే ధర్మము; ప్రకృతిని వాంఛించుటే అధర్మము .కనుక ప్రకృతిలోని అనేక విషయాదులను వాంఛించే మనస్సు యొక్క అధర్మ ప్రవృత్తిని అరికట్టి, ఆ మనస్సు ఆత్మయందే నెలకొల్పాలని ఇచ్చట భగవానుని ఉద్బోధ. మనస్సునకు భోగాల వలన ఆనందం లభించదు. "మనశ్శాంతి" అనునది అజ్ఞాన ప్రలాపము. " మనస్సు " అంటేనే అశాంతి ఇక అశాంతికి శాంతి ఎలా లభిస్తుంది ? కనుక మనస్సును ఆత్మయందు నెలకొల్పినప్పుడే మనోరాహిత్యమౌతుంది. ఆ మనోరాహిత్యమే మహానందము. కనుక ఆనందం ఆత్మ ద్వారానే లభిస్తుంది. అందువలన ఎల్లరూ పరమాత్మ కృపతో మనోరాహిత్య స్థితిని పొందుదురు గాక ! ○

వ్యాసం : 12

# నిత్య జీవితంలో

ఎంత వేదాంతం తెలుసుకున్నా, ఎన్ని పుస్తకాలు చదివినా ప్రతి మనిషీ ప్రధానంగా ఒక కుటుంబంలో సభ్యుడు. తన యింట్లో ఒక తండ్రిగా, ఒక భర్తగా, ఒక పుత్రుడుగా, అలాగే తల్లిగా, ఒక భార్యగా, ఒక పుత్రికగా, సోదరుడుగా, సోదరిగా ... యిలా వివిధమైన రీతుల్లో వ్యవహరించవలసి వుండటం మానవ జన్మలోని ప్రత్యేకత

ఆధ్యాత్మిక దృష్టి ఒక జ్యోతి వంటిది జ్యోతి వెలుగు దశదిశల విస్తరించినట్లే, మనిషి వ్యక్తిత్వం ద్వారా ఈ ఆధ్యాత్మికత కూడా అతని చుట్టూగలవారిలో ప్రవేశించి ఒక అపూర్వమైన పరిణామం తెస్తుంది ఆధ్యాత్మిక దృష్టి అంటే ఆదేదో సంసారానికీ, సమాజం యొక్క వేగవంతమైన పరిణామానికి అనుకూలమైనదనీ, అంతేకాక ఆధ్యాత్మిక దృష్టి మన అభివృద్ధికి అడ్డుపడుతుందనీ అపోహ పడటం చాలా మందిలో ఈనాడు వుంది ఆధ్యాత్మిక దృష్టి ఇల్లు వదిలి పెట్టిన సన్యాసుల కోసమేననీ,సంసారంచేసేవారికి అది ఒక ప్రతిబంధకం అని కూడా చాలామందిలో ఒక దురభిప్రాయం వుంది అటువంటి దురభిప్రాయాన్ని సరిచేయటం, ఒక అవగాహన కల్గించి, ఆధ్యాత్మిక దృష్టి ద్వారా మన యిల్లు, మన సంసారం, మన బిడ్డలు కూడా ఎంతో ప్రయోజనం పొందుతారని సూచించటమే ఈ వ్యాసాల యొక్క ఉద్దేశ్యం ఈ దృష్టి మన బిడ్డల్ని ఎలా ఉద్ధరిస్తుందో, మన పిల్లల పట్ల మనం వ్యవహరించవలసిన తీరులో ఎంత ఉన్నతమైన ఆధ్యాత్మిక విలువలున్నాయో, అవన్నీ మన నిత్య జీవితంలోని ఆధ్యాత్మిక దృష్టిని ఎలా సఫలీకృతం చేస్తాయో తెలుసుకోవటం చాలా అవసరం.

## మార్గదర్శకత్వం :

భగవద్గీతలో ఒక మంచి శ్లోకం వుంది "యద్యదాచరతి శ్రేష్ఠః, తత్తదేవేతరోజనాః" శ్రేష్ఠులు, పెద్దలు ఎలా ఆచరిస్తారో అందరూ వారినే అలాగే అనుసరిస్తారు అంటుంది భగవద్గీత( అ 3 శ్లోకం 21) దీన్ని సమాజపరంగా వ్యాఖ్యానించటం ఎంత యదార్థమో, కుటుంబపరంగా వ్యాఖ్యానించటం కూడా అంత యదార్థం తల్లి తండ్రి ఎలా వ్యవహరిస్తారో పిల్లలూ వారిని అనుసరిస్తూ అలాగే వ్యవహరిస్తారు

---

ఆధ్యాత్మిక దృష్టి ఒక జ్యోతి వంటిది. వ్యక్తిత్వం ద్వారా ఈ ఆధ్యాత్మికత కూ అపూర్వమైన పరిణామం తెస్తుంది. ఆధ్యాత్మి సంసారం చేసేవారికి ఇది ప్రతిబంధకమని భి అభివృద్ధికి అడ్డుపడుతుందని అపోహ పడటం క తీసివేసి 'ఆధ్యాత్మికత' అంటే సరియైన ఆ

శ్రీ పాతూరి ప్రసన్నం గారి వ్యాసముల లక్ష్

---

దురదృష్టవశాత్తు ఈ రీతిగా మార్గదర్శకత్వం వహించవలసిన పెద్దలే మానవత్వాన్ని కూడా మరచి ప్రవర్తిస్తూవుంటే, యిక పిల్లలు అనుచితంగా ప్రవర్తిస్తున్నారనీ, చెడిపోతున్నారనీ వాపోతే ఏం లాభం? సైన్సు టెక్నాలజీల్లో,అనేక రంగాల్లో ఎంతో అభివృద్ధిని సాధించిందనుకొనే అమెరికాలోని కుటుంబాల పిల్లల దుస్థితిని చూచినవారు చెబుతారు శ్రీమతి పెగ్గీమ్యాసన్ ప్రఖ్యాత జర్నలిస్టు. బ్రిటీష్ రచయిత్రి "Sai baba the incarnation, of love" అనే ఒక అద్భుతమైన గ్రంధం వ్రాశారు వారు. అందులో ఈ ప్రస్తావన

# ఆధ్యాత్మిక దృష్టి

- పొత్తూరి ప్రసన్నం

తెచ్చారు అమెరికాలోని ఒక కుటుంబంలో నలుగురు పిల్లలుంటే వారిలో ఒకడు పెద్ద నేరస్థుడు, ఒకడు మతి భ్రష్టుడు, ఒకడు సంకుచిత స్వభావుడు, ఒకడు మాత్రమే యోగ్యుడు ఇలా తయారుకావటానికి గల కారణం ఏమిటో తెలుసుకోవాలి. వారికి సైన్సు, ఆధునిక విజ్ఞానంలో శిక్షణ యిస్తున్నారే గానీ మానవత్వ పోషణలో ఏమాత్రమూ శ్రద్ధ తీసుకోకపోవటం, వారిపై పెద్దలయొక్క, తల్లిదండ్రులయొక్క సత్ ప్రభావం లోపించటం, దైవం, ఆధ్యాత్మికత అంటే

---

జ్యోతి వెలుగు దశదిశలా విస్తరించినట్లే మనిషి కూడా అతని చుట్టూ గలవారిలో ప్రవేశించి ఒక ... దృష్టి ఇల్లు వదిలిపెట్టిన సన్యాసులకోసమేనని భావించటం పొరపాటు. ఆధ్యాత్మిక దృష్టి మన కూడా పొరపాటే. అటువంటి దురభిప్రాయాలను అవగాహన కలుగజేయటానికి చేసే ప్రయత్నమే

- సం

---

ఏమిటో అనుభవ పూర్వకంగా తెలియజేయకపోవటం వారి పతనానికి కారణాలు. ఈనాడు మనమూ ఆ దోవనే నడుస్తున్నామేమో అనిపిస్తోంది "మనకే తెలియదు యింకా పిల్లలకి ఏం చెప్పగలం ?" అనే స్థితిలో బ్రతుకుతున్నాం.

కాబట్టి ఒక తండ్రిగా, ఒక తల్లిగా బిడ్డలకి మార్గ దర్శకత్వం వహించే బాధ్యతలో పిల్లలకి జరిగే మేలు ఎంత వుంటుందో పెద్దలకీ అంత మేలు జరుగుతుంది. "ఏదో పిల్లలకోసం" అనే ధోరణితో కాక, 'నాకోసం, నా పరమార్థ సాధనకోసం' అనేటంతవరకూ పెద్దలమైన మనం అవగాహన చేసుకోవాలి! ఎదగాలి

ఈ రోజుల్లో మన పిల్లలు చెడిపోవటానికి గల కారణం ప్రపంచ ధోరణిలేనని అందరి తల్లిదండ్రులూ చింతిస్తున్నారు ఎన్నెన్నో దుష్ట భావాలు పిల్లలపై ప్రసరిస్తున్నాయి అయితే అటువంటి దుష్టభావాలనుంచి పిల్లల్ని రక్షించగల శక్తి తల్లిదండ్రుల ప్రభావంలో వుంది, అని కూడా నిరూపించే సందర్భాలు ఎన్నో వున్నాయి.

ఒక తల్లి పిల్లవాడితో మార్కెట్టుకు వెళ్ళింది కూరలు కొంటోంది పిల్లవాడు దొంగచాటుగా నాలుగు కూరగాయలు తీసి అమ్మ బుట్టలో వేశాడు ఇంటికి వచ్చాక 'నా బాబే ! నా తండ్రే ! నాలుగు వంకాయలు కూరలవాడు చూడకుండా బుట్టలో వేశాడే !' అంటూ వాడేదో ఘనకార్యం చేసినట్లుగా మెచ్చుకుంది వాడు యిదే మార్గంలో పెరిగి పెద్దవాడై ఆరితేరిన గజదొంగ అయ్యాడు చివరికి పోలీసులకు పట్టుబడ్డాడు కఠిన శిక్ష పడింది తల్లి కోర్టులో జడ్జీగారిముందు "అయ్యో ! నా బిడ్డో !' అంటూ ఏడుస్తోంది అప్పుడు కొడుకు అన్నాడుట, "అమ్మా ! యిప్పుడు ఏడ్చి ఏం లాభం ? చిన్నప్పుడు కూరగాయలు దొంగిలిస్తుంటే నా బాబే అని ముద్దుపెట్టుకొన్ననాడే నేను చెడిపోయాను అనాడే ఆ తప్పుడు పనికి నా చెంప వాయించి వుంటే యిలా పూర్తిగా భ్రష్టుణ్ణి కాకపోయేవాణ్ణి కదా !" అన్నాడుట జడ్జీగారిముందే తల్లితో ఆ పుత్రుడు.

మనం పిల్లల్ని పెంచే పద్ధతే అది.

జనకుండధికుడు పాధ్యా
యునకు పదిమడుంగు లెక్కడు ద్వినాథా !

జననినకు దశగుణంబులు
జనని - గురుత్వమునకది ప్రశస్తము శృతులన్
(ఆ మ. చ. 139)

ఉపాధ్యాయుని కంటే తండ్రి పదిరెట్లు, తండ్రి కంటే తల్లి పదిరెట్లు అధికులు అంటుంది మహా భారతం.

కనుక ఈనాడు మన పిల్లల నైతిక వికాసం యొక్క బాధ్యతను, మనోవికాస బాధ్యతనూ కేవలం స్కూలు టీచర్లకు వొదిలివేస్తే ఎంతో పొరపాటు చేస్తున్నాం అని గుర్తించాలి. డబ్బు వుందికదా అని పొద్దున. రాత్రి ప్రయివేటు మాష్టారుగారి దగ్గరకు పంపితే మన బిడ్డలకు వ్యక్తిత్వ వికాసం లభించదు. "శరీరాన్ని యిచ్చిన తల్లితండ్రులే, మనోవికాసాన్ని కూడా కలిగించటానికి సమర్థులు" అందుకు బీదరికం ఒక అభ్యంతరం ఎన్నడూ కాదు.

ప్రపంచ ప్రఖ్యాత తత్త్వవేత్త యిమాన్యువల్ కాంట్ జర్మనీ దేశంలో పుట్టారు. "నా తండ్రి చెప్పులు కుట్టుకొని బ్రతికేవాడు. గంపెడు సంతానాన్ని పోషించటం ఆతనికి సాధ్యం కాలేదు. సరిగ్గా కడుపుకు చాలినంత తిండి పెట్టలేకపోయేవాడు కానీ ఎప్పుడూ నాకు మంచి మంచి ధర్మాలు బోధిస్తూ వుండేవాడు అదే నా లేత మనస్సుపై శాశ్వత ముద్ర వేసింది. నైతికంగా ఆధ్యాత్మికంగా నన్నొక మనిషిని చేసింది" అంటారు యిమాన్యువల్ కాంట్.

ఈనాడు మనలో ఎంతమంది తల్లిదండ్రులం ఈ సత్యాన్ని గుర్తిస్తున్నాం?

ప్రభుత్వం మన బీదరికాన్ని చూచి మన పిల్లలకు హాస్టళ్లు పెట్టవలసిందే! వారి చదువులకోసం ఎన్నో సబ్సిడీలు యివ్వవలసిందే! అంత మాత్రాన మన బిడ్డలు మనుషులుగా రూపొందలేరు మన మార్గదర్శకత్వం యొక్క ప్రభావం వారిపైన వుండితీరాలి.

## తండ్రీ - కొడుకూ - బింబ ప్రతిబింబాలు

"ఆత్మావై పుత్ర నామాసి" అంటుంది వేదం. తండ్రియొక్క దివ్యాత్మ అంశమే పుత్రుడుగా జన్మ ధరిస్తోంది అటువంటి బిడ్డ సహజంగానే సకల మానవత్వపు సద్గుణాలతోపుడతాడు. కానీ బాల్యంనుంచీ బిడ్డలపై ప్రసరించే దుష్ప్రభావాలే సహజంగా వారిలో కలిగిన మానవత్వం నుంచి దిగజార్చుతున్నాయి కనుక ఈ దుష్ప్రభావాల నుండి బిడ్డల్ని కాపాడటం ప్రధానంగా తల్లితండ్రుల బాధ్యతే

ప్రపంచం ఎప్పుడూ మంచీ, చెడ్డల సంకీర్ణ స్థితిలోనే వుంటుంది. కనుక సమాజంలో తప్పు పట్టటం, రోజుల్ని తిట్టుకోవటం, వాటివల్లే మా పిల్లలు చెడుతున్నారని బాధ పడటం అవివేకం అటువంటి సమాజంలో కూడా బిడ్డలపట్ల అత్యంత శ్రద్ధ, వారియొక్క శ్రేయస్సుకు చేయవలసిన త్యాగం వంటి లక్షణాలు మనలో పూర్తిగా వుండాలి ఒక చిన్న కథ. ఒక క్రిష్టియన్ 'ఫాదరీ' ఒక ఆదివారంనాడు ఉదయం చర్చికి పోయి "ప్రపంచం ఎలా బాగుండాలి?" అనే అంశంపై ప్రసంగించటానికి ఆలోచిస్తూ కూర్చున్నాడుట. అతని భార్య యింట్లో లేదు. పిల్లవాడు పెద్ద న్యూసెన్సుగాడు తండ్రిని ఆలోచించుకోనీయటంలేదు. వాడికి పని కల్పించాలని ఫాదర్ బాగా చిరిగిపోయిన ఒక ప్రపంచ పటం వాడికి యిచ్చి, "నాయనా! దీన్ని మళ్ళీ సరిగ్గా అతికించు" అని పని కల్పించాడు. ఆ పని వాడికి అంత త్వరగా తెమలదనీ, ఈ లోపల తన ఉపన్యాసం గూర్చి ఆలోచించుకోవచ్చు అనుకున్నాడు. కానీ ఆ పిల్లవాడు క్షణంలో ముక్కలుగా చిరిగిన కాగితాలు అతికించి ప్రపంచ పటాన్ని సరిగ్గా అతికించి యిచ్చాడు తండ్రికి ఆశ్చర్యం కలిగింది "ఎలా చేశావు?" అని ప్రశ్నించాడు తండ్రి "ఏముందీ! ఆ ప్రపంచ పటం కాగితం వెనుక ఒక మనిషి బొమ్మ వుంది. కొబట్టి మనిషి బొమ్మను చూస్తూ, ముందుగా మనిషి బొమ్మను సరిగ్గా అతికించాను అంతే! కాగితం వెనక్కు తిప్పి చూస్తే ప్రపంచపటం దానికదే సక్రమంగా అమరిపోయింది" అని సమాధానం చెప్పాడుట పిల్లవాడు. పిల్లవాడి "ఫాదర్" సంతోషించాడు. ఆయన ప్రసంగించవలసిన విషయం తెలిసింది. "మనిషి బాగు

పడితే ప్రపంచం బాగుపడుతుంది " అనే సత్యం ఈ సంఘటన ద్వారా అతనికి స్ఫురించింది.

ఈనాడు సమాజం చెడిపోతుందని పెద్దలందరూ వాపోతూ అనేక సంస్కరణలు చేస్తున్నారు కానీ కుక్కతోక వంకరలాగానే సమాజంలో చెడు పోయి నట్టే పోతూ, మళ్ళీ అవతరిస్తూనే వుంటుంది అది దాని లక్షణం నిజమైన సంస్కరణ యింట్లోనే ప్రారంభం కావాలి. మనిషి బాగుపడితే సమాజం అదే బాగుపడుతుంది, అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబా.

ఇక్కడ ఒక సందేహం కలుగుతుంది.

" ప్రతి తల్లీ, తండ్రీ పరిపూర్ణమైన వ్యక్తిత్వం కలవారయితే కదా, బిడ్డలకు ఆదర్శప్రాయులు కావటం ? " అని సందేహం కలుగుతుంది.

ప్రతి తండ్రీ, ప్రతి తల్లీ తన వ్యక్తిత్వంలోని విలువలను పెంచుకోవటం కోసం జీవితాన్ని ఒక సాధనగా తీసుకుంటే, తల్లిదండ్రులు గౌరవించే ఆ సాధనే పిల్లల్ని బాగుపరుస్తుంది. ఒక కుటుంబం వుంది తండ్రి తన నిత్య జీవితంలో జరిగే ప్రతి సందర్భంలోనూ, సంఘటనలోనూ మానవత్వంకోసం ఎలా స్పందిస్తాడో, కష్టనష్టాలను ఓర్చుకుంటూ తాను గౌరవించే విలువలను ఎలా నిలబెడుతున్నాడో బిడ్డలు చూస్తున్నారు అదే వారికి ఒక Education ! ఒక ప్రబోధ ! కనుక " మంచిగా వుండు " అని తల్లిదండ్రులు బిడ్డలకు చెప్పటంలో విలువ లేదు. తమ మంచి తనాన్ని నిలబెట్టుకోవటం కోసం పెద్దలు తీసుకొనే శ్రమ, చేసే త్యాగం – యివే పిల్లలలో మంచితనం వైపు ప్రేరణ కలిగిస్తాయి. కనుక పిల్లలలో ఈ రీతిగా మెలగుతూ మార్గదర్శకత్వం వహించటమే ఒక పెద్ద ఆధ్యాత్మిక సాధన అవుతుంది.

తల్లిదండ్రులు తాము చేయకుండా, పిల్లలకుమాత్రం " మీరు చేయండి " అని శాసిస్తే అది పెద్దరికం విలువ పోగొట్టుకోవటమే అవుతుంది.

## మనం ధృతరాష్ట్రులం కారాదు

ధృతరాష్ట్రుడు గుడ్డివాడే కాదు. అతని ప్రేమ కూడా గ్రుడ్డిదే పుత్ర వ్యామోహం. " నా కొడుకు ఏది చేసినా సహిస్తాను. అది అతనిపట్ల నాకు గల నిజమైన ప్రేమ " అని చెప్పుకొనే తల్లిదండ్రులు కొందరున్నారు పిల్లలపై యిటువంటి ప్రేమను కురిపించటం పిల్లల భవిష్యత్తును పాడుచేయటమే అవుతుంది. పిల్లలపట్ల మనకి ధృతరాష్ట్ర ప్రేమ కారాదని భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు చెబుతారు. తాను ప్రదర్శించిన ఈ గుడ్డి ప్రేమకు మూల్యం తన వంశాన్నే సర్వనాశనం కావించుకోవటమే అయింది ధృతరాష్ట్రుని విషయంలో.

ఒకసారి ఒక భక్తుడు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారిని తమ గృహానికి ఆహ్వానించారుట " ఒక తండ్రిగా నీ కొడుకుపట్ల నీకు గల బాధ్యతను విస్మరించావు నీ కొడుకు ఒకడు చెడితే ఫర్వాలేదు, ఎంతో మందిని చెడగొడుతున్నాడు నీ కుమారుణ్ని నీవు సక్రమంగా పెంచితే వాడివల్ల సంఘానికి యింత చేటు జరిగేది కాదు కదా ! " అన్నారుట భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. వారు ఆ భక్తుని యింటికి వెళ్ళనేలేదుట. ప్రతి తల్లీ తండ్రీ గుర్తించవలసిన ముఖ్యమైన ధర్మం యిదే మనం మన ఆత్మానందంకోసం, ఆత్మసాక్షాత్కారానికీ ఎన్నో ఆధ్యాత్మిక సాధనలు చేయవచ్చు. వీటన్నింటికీ మిన్నగావున్న ధర్మం మనం మన బిడ్డల పెంపకంలో చూపించవలసిన నైతిక బాధ్యతే.

ఈ విషయంలో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి ప్రభావం అపూర్వంగా ఈనాడు సమాజంపై ప్రసరిస్తోంది పిల్లలలో నైతిక ధార్మికమైన వికాసం కలిగించటంకోసం 'బాలవికాస్', " Education in Human Values " వంటి ఉద్యమాలు శ్రీ సత్యసాయి భక్తులచేత, సేవాసంస్థలచేత, నిర్వహింపబడుతున్నాయి.

పిల్లల తల్లిదండ్రులు భగవాన్ బాబావారు ప్రబోధించిన రీతిగా మానవత్వపు విలువలను, ధార్మిక,

## .... కాకపోతినే !

సాయిగీతనైన, కాదు
నీ చెంపలు, ముద్దిడటానికి
సాయిగీతమైన, కాదు
నీ చెవులు రాగాలతో, స్పృశించటానికి
ప్రశాంతి గోడ, ఇటుకైన కాదు
నీ చేతి స్పర్శతో, ఆనందించటానికి
ప్రశాంతి, ఇసుక రేణువైన కాదు
నీ పాదరేణువై, పులకించటానికి
నీ కాలి అడుగునై ; నీ కనుల వెలుగునై
నీ చేతి మురళినై, నీ పెదవిరాగామై
నీ పదమునై, నీ కవితనై
నీ భావమునై, నీ పలుకునై పోవాలిరా
సాయికూనా

– పి. రాజ్యలక్ష్మి రంగారావు

నైతిక, ఆధ్యాత్మికమైన విశేషాలనూ పిల్లలకు ' బాల వికాస్ ' తరగతులలో నేర్పుతారు ఇది పెద్దలకు ఒక ఆధ్యాత్మిక సాధనగాకూడా పరిణమిస్తుంది.

పిల్లలకు ఈరీతిగా శిక్షణ యివ్వటం ద్వారా కలిగే ప్రయోజనం పిల్లలకే కాదు, పెద్దలకుకూడా దక్కుతుంది. తాము తెలుసుకొని, తాము ఆచరించి, తాము అనుభవించిన తర్వాతనే పిల్లలకు చెప్పాలి. కనుక ముందుగా తాము తెలుసుకోవటం, తాము ఆచరించటం అనుభవించటం అనేవి ఆధ్యాత్మిక సాధనలోని విలువైన అంశాలు అలాంటి శిక్షణ గరపటం కూడా పెద్దలకు ఒక సాధన అవుతుంది

ఒకసారి శ్రీ రామకృష్ణ పరమహంస వద్దకు ఒక తల్లి తన పిల్లవానితో వచ్చింది. " స్వామీ ! ఈ పిల్లవాడు బెల్లం తినవద్దంటే తింటున్నాడు ఎక్కువగా బెల్లం తినటంచేత వీడి కడుపు చెడిపోయింది. తినవద్దని చెప్పండి " అని ఆమె పరమహంసవారిని ప్రార్థించింది. " ఒక వారం తర్వాత మరల రా " అని చెప్పారు శ్రీ రామకృష్ణ పరమహంస ఆమె పిల్లవానితో వారం తర్వాత వచ్చింది అప్పుడు శ్రీ రామకృష్ణ పరమహంస ఆ అబ్బాయితో "బాబూ ! అతిగా బెల్లం తినకూడదు నీ ఆరోగ్యం చెడిపోతుంది. ఇకమీద బెల్లం తినబోకు " అని చెప్పారు "స్వామీ! ఈ మాటలు వారం క్రితమే ఎందుకు చెప్పలేదు " అని తల్లి ప్రశ్నించింది " అమ్మా ! నాకు కూడా అతిగా బెల్లం తినే అలవాటు వుంది. నేను తింటూ పిల్లవాడిని తినవద్దని ఎలా చెబుతాను ? కనుక ఈ వారం రోజుల్లోనూ నేను బెల్లం తినటం మానుకొని, ఈ రోజున పిల్లవాడికి తినవద్దని చెప్పే అర్హత పొందాను " అన్నారు శ్రీ రామకృష్ణ పరమహంస

ఆఫ్రికాలో వుండగా గాంధీజీ ఒక ' ఫారం ' నిర్వహించారు. దాని పేరు " టాల్‌స్టాయి ఫారం " కొన్ని కుటుంబాలు ఆ " ఫారం " లో సహజీవనం చేసేవి అప్పట్లోనే గాంధీజీ నైతికంగా, తాత్త్వికంగా, ఆధ్యాత్మికంగా ఎంతో ఎదిగారు. అప్పుడు తమ కుటుంబాలలోని పిల్లలు చెప్పిన మాట వినకుండా ఒక సమస్యగా తయారైనారు. వారిని తిట్టటం, కొట్టటం వంటి పనులు గాంధీజీకి యిష్టం లేదు. కానీ పిల్లలకు ఎలా నచ్చచెప్పాలి వారిని తన మార్గంలోకి ఎలా తీసుకురావాలి ? ఈ సమస్యకు ఒకే ఒక పరిష్కారం గాంధీజీకి స్ఫురించింది తిండి తినటం మానివేశారు. " మీ మీద నాకు కోపం లేదు నా మీదే నాకు కోపంగా వుంది " అంటూ పిల్లలతో చెప్పి నిరశన వ్రతం ప్రారంభించారు వెంటనే పిల్లల మనస్సులలో మార్పు కలిగింది "సత్యాగ్రహం" అనేది గాంధీజీ జీవితంలో ఈ రీతిగా పిల్లలను సరిదిద్దటం కోసం ప్రారంభమయింది, అని తర్వాత గాంధీజీ చెప్పారు

కనుక పిల్లలను ప్రేమిస్తూ మంచి చెడ్డల తార తమ్యాన్ని వారంతట వారే తెలుసుకొనే రీతిగా మనం వ్యవహరించాలి. ధృతరాష్ట్రునివలె పుత్రుల పట్ల గల ప్రేమ మోహంగా, కళ్ళు కప్పేది కారాదు.

ఇటీవల ఎన్నో వైజ్ఞానిక పరిశోధనల్లో మనం పిల్లల పట్ల, పూలమొక్కల పట్ల, పశు పక్ష్యాదుల పట్ల తోటి వారి పట్ల చూపించే నిర్మల నిస్వార్థమైన ప్రేమ యొక్క సత్ఫలితాలు ఎలా ఉంటాయో నిరూపించబడింది నిజమైన, నిర్మలమైన ప్రేమ ఉన్నచోట సత్య ధర్మ శాంతి అహింసలనే మానవత్వపు విలువలు వికసిస్తా యనే యదార్థం గుర్తించబడింది పిల్లలు యిటువంటి ప్రేమను చవిచూచేది తమ తల్లిదండ్రుల దగ్గరేకదా ! కనుక పిల్లలపట్ల అటువంటి ప్రేమతో బ్రతుకుతూ, వారి లేత జీవితాలను ప్రేమ అనే అమృతంతో పోషించ టమే పెద్దలకు ఒక గొప్ప ఆధ్యాత్మిక సాధన కూడా

## మమకారానికి హద్దులు

బాల్యంలోనే పిల్లల మనస్సులలో ఒక మంచి ప్రభావాన్ని ప్రవేశ పెరచాలి యిరవై సంవత్సరాలు వయస్సు వచ్చేసరికి పిల్లవాణ్ని ఒక స్నేహితుడుగా చూడటం ప్రారంభించాలి ఏది మంచి, ఏది చెడు తనకు ఏది హితవు, ఏది అహితవు అనే వివేక జ్ఞానం పిల్లవానిలో కలిగించటం వరకే పెద్దల బాధ్యత! అంతే తప్ప "నేను చచ్చేదాకా నా కొడుకును శాసిస్తూవుంటాను అది నా హక్కు" అనే ధోరణిచేత తండ్రి కుమారుని దృష్టిలో గౌరవాన్ని పోగొట్టుకుంటాడు

బిడ్డల జన్మలకు కారకులే కానీ, వారి వారి ప్రారబ్ధ కర్మలకు కాదు అనే సత్యాన్ని పెద్దలు తెలుసుకొని వర్తిస్తే "పుత్రేషణ" అనే బంధంనుంచి పెద్దలు బయట పడుతారు.

శ్రీ నారాయణస్వామి అగర్భ శ్రీమంతుడు సేలం నగరానికి మేయర్‌గా స్వాతంత్ర్యం రాని రోజుల్లోనే ఎంతో ప్రఖ్యాతి గాంచారు శ్రీమాన్ చక్రవర్తుల రాజ గోపాలాచారిగారికి ఎంతో సన్నిహిత మిత్రుడు. లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగా, న్యాయవాద వృత్తిలో ప్రముఖుడుగా పేరెన్నికగన్న వ్యక్తి. తన కుమారుని కలెక్టరు చేయాలని కలలుకన్నాడు కానీ అకస్మాత్తుగా యువకుడైన కొడుకు ప్రమాదంలో మరణించాడు ఈ దారుణ సంఘటన చేత శ్రీ నారాయణస్వామి దుఃఖంతో కొట్టుకుపోయి పిచ్చివాడు కాలేదు ప్రతి మనిషికీ ఒక "Destiny" ( విధి లిఖితం ) వుంది, అనుకొని తన విధి లిఖితాన్ని తెలుసుకోవాలనే తపనలో పడ్డాడు. రమణమహర్షి వద్ద కొంతకాలం గడిపాడు. పూనాలో మెహర్‌బాబావారిని కలిశారు వారు శ్రీ నారాయణ స్వామిని సకోరీలో గల ఉపాసనీ మహరాజ్ వద్దకు పంపారు. వారు శ్రీ నారాయణస్వామిని షిరిడీ పంపిం చారు "నీ జన్మ సాఫల్యం షిరిడీలో అవుతుంది" అన్నారు. అప్పటికే షిరిడీసాయి బాబావారు సమాధి చెందారు. శ్రీ నారాయణస్వామి మహారాష్ట్ర భాషను నేర్చుకొని సాయిసాక్షాత్కారం పొంది "ఆలిండియా సాయి సేవా సమాజం" స్థాపించి, ఒక మహాభక్తుడుగా ఒక యోగి పుంగవుడుగా తరించారు.

ఈ రీతిగా నిత్య జీవితంలో మన పిల్లలకు మనం మార్గదర్శకులుగా బ్రతకటంలోనే ఎంతో ఆధ్యాత్మిక మైన ప్రయోజనం కూడా వున్నదని గుర్తించాలి ! అంతే తప్ప పిల్లలు ప్రతిబంధకాలనీ, "వాళ్ళ కర్మకు వారిని వదిలేసి నేను కృష్ణా రామా అనుకుంటున్నాననీ" పెద్దలు బ్రతకటం ఆధ్యాత్మికం అనిపించుకుంటుందా? ఈ ప్రశ్నకు ఎవరికి వారే సమాధానం పొందాలి

---

"ఆలస్యం చేయకు చేయవలసిన పనిని వెంటనే చేయాలి తీరా గట్టు తెగినతరువాత చెరువుకు కట్ట కట్టడానికి వీలుపడదు. పట్టుదల వదలకు నీ కార్యం నిశ్చయంగా జయమవుతుంది

– రాజాజీ రామాయణంనుండి

వేసవి తరగతుల ప్రసంగం_12

# ఐకమత్యమే మహా బలం

భగవాన్ బాబావారి దివ్య ప్రబోధ

అతిగ భాషణ చేయ మతికి హానియు
గూర్చు
మితిగ భాషణ చేయ మతికి హాయి
మిత హిత భాషణ యిచ్చు శాంతి
కాన మిత భాష నేర్చుడీ హితముగూర్చి
ఫిల్ము రికార్డింగు ప్లేటును చూచిన
అన్ని ఒక్కటిగానె అమరియుండు
సౌండు బాక్సునందు సవరించి
చూచిన
పాటలెన్నో విధము పాడుచుండు

విద్యార్థులారా ! విద్యార్థినులారా !

పరతత్త్వమును గుర్తించవలెనన్నను, పరులకు బోధింపవలెనన్నను చిత్తశుద్ధి అత్యవసరము చిత్త శుద్ధి లేకుండిన తాను అర్థము చేసుకొనలేడు. పరులకు బోధించలేడు. ఒక గది యందు ప్రకాశము పవిత్రము వుండినప్పుడు ఆ గదిలో ఎట్టి విషక్రిములు చేరుటకు వీలుండదు ఏ గదిలో ప్రకాశము, పరిశుద్ధము లేకుండా వుండునో అట్టి గది యందే విషక్రిములు ప్రవేశిస్తూ వుంటాయి. అటులనే ప్రేమ గల హృదయమునందు పవిత్రమైన భావములందు, కామక్రోధాదులు అనే విష బీజములు ప్రవేశించుటకు వీలుండదు. ఏ హృదయము ప్రేమరహితమై, పవిత్రరహితమై, వుంటుందో ఆ హృదయమునందే కామక్రోధాది క్రూర మృగములనే విషక్రిములు ప్రవేశిస్తూవుంటాయి. కనుక మానవుని హృదయము ప్రేమమయంగా మారాలి. ఎవరి హృదయము ప్రేమమయంగా వుండునో అట్టి ప్రేమమయమైన హృదయము శాంతమయంగాను, సౌఖ్యమయంగాను, దివ్యమయంగాను, భవ్యమయంగాను, రూపొందుతుంది.

మానవత్వములో కొన్ని విధములైన అపోహలు అనేక విధములుగా వస్తుంటాయి. అందువలననే మానవత్వములో అనేక విధములైన చీకట్లు క్రమ్మి మానవుని సత్యత్వమునకు అనేక అడ్డులు తగులుతాయి. జ్ఞానము కలుగవలెనన్న అనేక విద్యలు నేర్చనక్కర లేదు. ఎన్ని విద్యలు నేర్చినప్పటికి ఎన్ని విధములైన సాధనలు సల్పినప్పటికిని హృదయము పవిత్రము కాకుండిన యివన్నీ కేవలము వ్యర్థము కృత్రిమమైన యంత్రముగా రూపొందుతుంది జ్ఞానమనగా కేవలము గ్రంధములతో మనకు యేర్పడేది కాదు. జ్ఞానము పరులచేత బోధింపబడేది కాదు బోధనలన్నియు మనుషులకు బోధిస్తున్నారేగాని, మనస్సుకు బోధించటం లేదు కనుక మనస్సుకు బోధించాలి గాని మనిషికి బోధించి ప్రయోజనము లేదు రామకృష్ణ పరమహంస ఎట్టి విద్యలు నేర్చలేదు శారదాదేవి కూడను ఎట్టి విద్యలు నేర్చలేదు కానీ వారి పేరు ప్రతిష్టలు ప్రపంచ మంతటా వ్యాపించాయి అదే సమయంలో ఎంతమందో మేధావులు వుండేవారు. ఎంతమందో విద్యావంతులు వుండేవారు. ఎంతమందో పండితులు వుండేవారు. కానీ వారికి రాని గౌరవము ఈ రామకృష్ణకు ఎలా వచ్చింది? చిత్తశుద్ధియే దీనికి మూలకారణము. మనసులో వున్నది

మాటలో చెప్పేవాడు రామకృష్ణ ఈనాటి విద్యావంతులందు మనసులో ఒకటి, మాటలో మరొకటి. కనుక మానవత్వమనేదే కోల్పోతున్నారు మనసులోని ఆలోచన మాటలోని సూచన క్రియలోని ఆచరణ ఈ మూడు ఒక్కటై వుండాలి కానీ యీనాటి మానవుడు ఒకదానికొకటి పొందిక లేదు కనుక

**మానవత్వమనగ మనసు మాట క్రియయు**
**అన్ని ఒకటిగానే అతికియుండు**
**మనసునందు ఒకటి మాటయు క్రియయు**
**వేరు వేరులైన విలువదేమి ?**

కనుక జ్ఞానము అజ్ఞానము రెండు ఒకదానికొకటి సన్నిహితసంబంధమై వుంటున్నది ఎక్కడ ప్రకాశమో అక్కడనే చీకటి కూడా వుంటుంది

జ్ఞానమనే దాని ప్రక్కలోనే అజ్ఞానము చేరి వుంటుంది. భగవంతునిపై విశ్వాసము గలవాడు భగవంతుడు ఎక్కడ చూచినా కలడంటాడు. భగవంతునిపై విశ్వాసము లేనివాడు భగవంతుడు లేడు అంటారు. చక్కెరతో కలిపిన నీరు సామాన్యమైన నీరు చూడటానికి ఒక్కటిగానే వుంటాయి కానీ ఏ నీటిలో చక్కెర వున్నదని మనం తెలుసుకోవాలంటే నాలుకపై వేసుకొని రుచి చూడాలి. అదే విధముగనే రెండు ఒక్కటిగానే వుండినప్పటికిని ఒకదానికొకటి సన్నిహిత సంబంధ బాంధవ్యము చేసేటువంటి విధి విధానములో భక్తులు కొంత జాగ్రత్తపడాలి. విశ్వాసము లేనివాడు God is no where అంటాడు God is no where నాలుగు పదములు no కు where లోని 'w' చేరిస్తే God is now here అయిపోతుంది కొత్తది తెచ్చి అక్కడ పెట్టలేదు ఉన్న "w" తీసివేయలేదు ఉన్నదానిని అటు ఇటూ జరపటమే లేనిదానిని వున్నదని చెప్పటానికి వీలుకాదు ఉన్నదానినే లేదని చెపుతున్నాడు యీనాటి మానవుడు. There is no God అంటాడు నాస్తికుడు అనగా వున్నదానిని లేదంటున్నాడు కానీ లేనిదానిని కాదు వున్నదనటం. ఈ పదములో Thee is మొదలు వచ్చింది. no తరువాత వచ్చింది There is అక్కడ వుంది. తరువాత no God వచ్చింది ఉన్నదానిని లేదంటున్నాడేగానీ లేని దానిని కాదు లేదనటం. లేని దానిని లేదని చెప్పటానికి అతనికి అధికారమే లేదు

కనుక యీనాటి విద్యలందు యీ విధమైన అయోమయ స్థితిని పొందుతున్నారు. ఇది చెబితే వినరు, స్వతస్సిద్ధముగా ప్రయత్నము చేయరు ఇదియే మూర్ఖత్వము ఒక తండ్రి తన కుమారుని తీసుకొని ఒక పాఠశాలలో చేర్పించాలని ప్రయత్నించాడు. నా కుమారుడు చాలా తెలివైనవాడు, చురుకైనవాడు వానికి అన్నీ తెలుసునన్నాడు తండ్రి టీచరు అన్నాడు "అన్నీ తెలుస్తే యిక్కడకు ఎందుకు తెచ్చారు?". "కానీ రెండు మాత్రము తెలియదన్నాడు తనకు తెలియదు, ఒకరు చెబుతే వినడు అవే అతనిలో వుండే దోషములు" అన్నాడు ఈనాటివిద్యార్థులందు తమకు తెలియదు చెప్పితే వినరు. యిలాంటి మూర్ఖత్వము వున్నంతకాలము కూడను అట్టివానికి ఆత్మతత్త్వము అర్థము కాదు కనుక ఆత్మతత్త్వము గుర్తించవలెనన్న మొట్టమొదట చిత్తశుద్ధిని యేర్పరచుకోవాలి ఇలాంటి పరిశుద్ధమైన హృదయాన్ని ప్రయత్నపూర్వకంగా సాధించాలి

విద్యార్థులారా ! విద్యార్థులందే మాత్రము కాదు సర్వ మానవులందు కూడను కొన్ని విధములైన విలువలు వున్నవి కానీ ఆ విలువలు వారు గుర్తించటానికి ప్రయత్నించటం లేదు. ఆ విలువ లేకపోతే మానవ జీవితమునకే రుచి లేదు పప్పులో ఉప్పు లేకపోతే యే విధంగా రుచి హీనముగా వుంటుందో మానవుని యందు రుచియైన ప్రేమతత్త్వము లేకపోతే మానవత్వమే వ్యర్థమైపోతుంది. కనుక యీ ప్రేమ కూడను ఎంతెంత స్థానములో ఏఏ స్థానములో ఏఏ పరిస్థితులలో ఎంతవరకు ఉపయోగపెట్టాలో అంతవరకే ఉపయోగపెట్టుకోవాలి. ఇది ప్రాకృతమైన ధర్మము. అదే పారమార్థిక ధర్మములో దీనికి ఎట్టి హద్దు లేదు.

ఇప్పుడు యింత పప్పు వుంటుంది. మనము పప్పు వండాలనుకున్నప్పుడు పప్పుకు తగినంత ఉప్పువేయాలి. పప్పులో ఎక్కువ ఉప్పు వేస్తే మనము యేమాత్రము తినలేము లేక పప్పులో ఉప్పు వేయకపోతే రుచే కలుగదు. ఒక్క గంటలో అరగిపోయే పప్పులో కొంత ఉప్పు తగ్గితే ప్రక్కకు నెట్టివేస్తాము ఇరవై సంవత్సరములు, ముప్పైసంవత్సరములు పెరిగిన మన జీవితములోపల ప్రేమ అనే రుచి లేకపోతే సమాజము మనలను ఎట్లా గౌరవిస్తుంది? ఆ ప్రేమతత్త్వాన్ని కూడను పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి నీ తుచ్ఛమైన వాంఛలను పురస్కరించుకొని యీ తుచ్ఛమైన వాంఛలలో ప్రవేశపెట్టకూడదు మీదంతా స్వార్థపరమైన ప్రేమ, స్వప్రయోజనమైన ప్రేమ. ఇలాంటి ప్రేమ యందు మాత్రం విద్యార్థులు అత్యంత జాగ్రత్తగా వుంటుండాలి.

ఈ ప్రేమతత్త్వాన్ని కొంతవరకు గుర్తించవలెనంటే మనము మన శక్తిని మన స్థాయికి మన విద్యకు, వయస్సుకు, గుణమునకు తగినట్లుగా ఉపయోగ పెట్టుకోవాలి. అంతర్భావము గుర్తించే వ్యక్తులు చాలాతక్కువ బహిర్ దృష్టియే చాలా ఎక్కువ దృష్టిని పురస్కరించుకొనియే ప్రేమయొక్క స్వభావము మంచి చెడ్డలుగా పోల్చుకుంటూవుంటారు. దీనికి ఒక చిన్న ఉదాహరణము. ఒక ఇరవై సంవత్సరముల విద్యార్థి, పదునెనిమిది సంవత్సరముల తన సోదరి ప్రయాణము చేస్తున్నారు వీరిద్దరు బీచ్‌కి వెళ్ళినారు. కానీ ప్రాకృత జీవులు వీరిని చూచి ఏమనుకుంటారు? వయసు బట్టి వీరిద్దరు భార్యాభర్తలని భావిస్తారు దీనికి కారణంఏమిటి? వయస్సు వయసుకు తగినట్లుగా వీరిరువురు ప్రయాణము చేయటమే దీనికి తగిన దోషమని నిరూపిస్తుంది సమాజము కనుక యీ వయస్సునందు సోదరియైనప్పటికిని యిరువురు ప్రయాణము చేయకూడదు దీనికి ఆధ్యాత్మికము కొంతవరకు అడ్డు చెప్పుతుంది నాయనా! సర్వులూ హృదయమెరిగినవారు కాదు. వీరిరువురు కూడా సోదర సోదరీమణులే కానీ ప్రకృతిలో మీరు జీవిస్తున్నారు. సమాజము యొక్క గౌరవము మీరు కాపాడాలి. కనుక మీ గౌరవమును పురస్కరించు కొనియే సమాజము యొక్క గౌరవము పెరుగుతుంది. ఇదియే నీతి అని బోధిస్తూవచ్చింది ఈ వయః భేదము పురస్కరించుకొని విద్యార్థులు సమాజమునే లెక్కచేయకుండా ప్రవర్తిస్తుంటారు. కనుకనే వీరి జీవితములో ఒక మాయని మచ్చగా రూపొందుతూ వస్తున్నది దోషము. కనుక అలాంటి మచ్చలకు మనము యేమాత్రము అవకాశము ఇవ్వకూడదు. సోదరి అయినప్పటికిని నీవు సోదరుడవు అయినప్పటికి అతి జాగ్రత్తగా ప్రవర్తించాలి. మరొక ఉదాహరణము అరవై సంవత్సరముల మగవాడు యిరవై సంవత్సరముల బాలికతో ప్రయాణము చేస్తున్నాడు ఆమెను వివాహమాడాలని ప్రయత్నిస్తున్నాడు. కానీ సమాజము చూచి వారిని యేమంటుంది. Grand father, grand daughter అంటుంది ఈ భావమునకు కారణముఏమిటి? వయస్సే దీనికి కారణము. కనుక వయః ప్రమాణము, అవస్థాప్రమాణము, గుణప్రమాణము అని మూడు రకములైన ప్రమాణములుంటున్నాయి. దీనికి చిన్న ఉదాహరణము.

రామాయణము లోపల సుగ్రీవుడు కోతి జాతి. రాముడు మానవజాతి. ఈ మానవజాతికి వానరజాతికి స్నేహము ఎట్లా కుదిరింది? ఈ స్నేహమునకు అవస్థా ప్రమాణములు కొన్ని వుంటున్నాయి బాధలు పురస్కరించుకొనియే యిరువురు మిత్రులయ్యారు నాకెట్టి బాధనో అతనికి అట్టి బాధ అతనికి ఎట్టి బాధనో నాకు అట్టి బాధ ఏమిటి యీ Problems. రాముడు రాజ్యమును వదిలి భార్యావియోగముతో అరణ్యములో సంచరిస్తున్నాడు. సుగ్రీవుడు కూడను రాజ్య భ్రష్టుడై భార్యావియోగముతో పరితపిస్తున్నాడు. ఈ యిరువురి అవస్థలు ఒకటి కావటం చేతనే అతనికి మిత్రత్వం ఏర్పడింది. కనుక మైత్రి అనేది కేవలము మానవులకు మాత్రమే కాదు. అవస్థలను పురిస్కరించుకొని పెరుగు

తుంది, తరుగుతుంది మానవత్వము లోపల ఇలాంటి సామాజికమైన చిన్న చిన్న ధర్మములన్నీ చేర్చుకోవాలి కానీ ఈనాటి యువకుల యొక్క బుద్ధి జగత్తునంతా చేర్చి పెట్టుకుంది ఎక్కడ చూచిన విషయాలు తనకు అవసరములేని విషయములను కూడా విచారణ చేస్తూ వుంటాడు అదే విద్యార్థులకు దుష్ట చదువుగా యేర్పడుతున్నది. అవసరమైన చదువులు చదవండి అవసరము లేని చదువులు చదవకూడదు పిచ్చిపిచ్చి పుస్తకాలు చదవకూడదు. కానీ యీ వయస్సు అలాంటి చెడ్డ వాటినే ఆకర్షిస్తుంది కారణం ఏమిటి? సంస్కారము పురస్కరించుకొనియే ఈ బుద్ధి పెడమార్గము పడుతుంది. అలాంటి పిల్లలకు ఎన్ని విధములైన పవిత్ర భావములు బోధించినప్పటికి అవి తలలో చేరవు తన లోపల ఎట్టి విచారములు లేని తలగా మనం మార్చుకోవాలి. అది అంత సులభము కాదు అయినప్పటికి అవి చేర్చుకుంటే మనలో చేర్తున్నాయి గానీ చేర్చుకోపోతే అవి చేరటానికి వీలులేదు. ఇది ఎట్లావుందంటే మనం ఒక ఇల్లు కట్టుకున్నాం. గాలి రావటము, పోవటము కోసము కిటికీలు ఎక్కువగా పెట్టుకున్నాము. మంచి సింహద్వారము పెట్టుకున్నాము. ఈ ద్వారములు మనం ఎందుకు పెట్టుకున్నాం? మనము పోవటానికి రావటానికి లేక మన బంధువులు, మిత్రులు రావటానికి పోవటానికి ద్వారాలు పెట్టుకున్నాము అంతేగానీ ద్వారములున్నాయి కదాయని బజార్లో పోయే పందులను, కుక్కలను మనం ప్రవేశపెట్టము మన శరీరములో యింద్రియములనే ద్వారములుంటున్నాయి ద్వారములున్నవి కదా అని అన్నింటిని మనం ప్రవేశపెట్టకూడదు ఎవరిని మన యింటిలో ప్రవేశపెట్టాలి? వచ్చేవాడు దొంగా? దొరా? అని మనం విచారణ చేయాలి దొంగే దొరగా వచ్చి ప్రవేశించి అంతా దోచుకొని పోవచ్చు ఈనాడు అదే జరుగుతున్నది సాక్షాత్తు ఈ దొంగలనే దుష్ట గుణాలు లోపల ప్రవేశించి మానవత్వములో వున్న సద్గుణములనే మాణిక్యములను దోచుకుపోతున్నారు. కనుక యీ మానవుడు శక్తిహీనుడై పోయి, ధైర్యమును కోల్పోయి జగత్తులో జీవితంపై విరక్తిపాలై అనేక విధములైన అవస్థలకు గురౌతున్నాడు

విద్యార్థులారా! మాణిక్యము వంటి జీవితము మానవ జీవితము. ఈ దుష్టభావములైన మసిబొగ్గులకు మనం అమ్ముకోకూడదు.

"ఏమిలేని బుఱ్ఱలోన యేమైనా చేర్చవచ్చు
ఏమేమో నిండియున్న తెంబుర ఖాళీలగునా?
తంబురది ఖాళీకాక యిలను
సుకృతము సంపాదగునా!"

ఈ దుష్టగుణములు మీరు ఖాళీ చేసుకున్నప్పుడే సద్గుణములు, సన్మానములు, సద్భావములు, సచ్చింతలు అనే వాటిని అందులో నింపవచ్చును కనుక మనము మొట్టమొదట యేవిధంగా చెడ్డ, యేవిధంగా మంచి అని పరిశీలన చెయ్యాలి పరిశీలన చేయక blind (గ్రుడ్డి)గా మనం విశ్వసించకూడదు నిజముగా చెడ్డ అని తెలుస్తే వీడు దానిని ప్రవేశపెట్టడు ఎట్లా? ఒక విషసర్పము వుంటున్నాది ఆ త్రాచుపాములో విషమున్నది అని మనకు బాగా తెలిసినప్పుడు దానిపై మనము పడటానికి మనం ప్రయత్నిస్తామా? ఎంతమంది వచ్చి మనలను నెట్టినప్పటికిని మనము తప్పుకోటానికి ప్రయత్నిస్తాము గానీ దానిపై పడటానిక ప్రయత్నించము ఎందువలన అందులో విషమున్నదని తెలుసు దానిని తెలుసుకున్న తరువాతనే తప్పించుకోటానికి ప్రయత్నిస్తూవుంటారు. ఈనాడు మనము ప్రవర్తించే ప్రవర్తనలన్ని యేవి మంచివి? చెడ్డవి? అని విచారణచేసి అందులో మనము ప్రవేశించాలి కాని యీనాటి విద్యార్థులు సమష్టి విచారణ చేయకుండా వ్యష్టివిచారమును మాత్రము చేస్తున్నారు. వ్యక్తిగతమైన భావాన్ని మనం అక్కడ చూడకూడదు సమిష్టియైన భావాన్ని మనం అక్కడ ప్రవేశపెట్టాలి. ఎందుకంటె నీవు

ఒకడుగా వున్నప్పుడు స్వేచ్ఛగా వుండవచ్చును కానీ నీవు సమాజములో వుండినప్పుడు సమాజము యొక్క నీతిని మనము కొంతవరకు ఆదర్శముగా తీసుకోవాలి. నాకీ సమాజముతో అవసరములేదు. నేను యీ సమాజమును యేమాత్రం లెక్కచేయను, నా స్వాతంత్ర్యము నేను అనుభవిస్తాను అంటే సమాజము నిన్ను శిక్షిస్తుంది. ఆ శిక్షకు నీవు బద్ధుడు కావలసి వస్తుంది సమాజము నిన్ను శిక్షించకపోయినప్పటికీ నీ conscience (మనస్సాక్షి) నిన్ను శిక్షిస్తుంది కనుక మనము యీ విచారణ చక్కగా చేయాలి. ఈనాటి విద్యార్థి లోకమంతా విషయార్థి లోకంగా మారుతున్నది గానీ విద్యార్థి లోకంగా మారటంలేదు విషయాలను మేమాత్రం ఆశించకూడదు. ఎందుకంటే నీవు విద్యార్థివి. విషయార్థివి కాదు కనుక మనము ఇలాంటి భావాలను అభివృద్ధిపరచుకొని మంచి పేరు తెచ్చుకోవాలి. 'కాకి వగుచు కలకాలము బ్రతుకక, హంసవలె క్షణమె ఆడుడూరా' మంచి పేరు తెచ్చుకొని ఒక పది సంవత్సరాలుండినా చాలు కాకి మాదిరి నూరు సంవత్సరములు బ్రతికే దానికంటె. నీవు మానవుడవు. నీవు పవిత్రమైన దైవాంశము కనుకనే భగవద్గీతయందు మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః' నీవు ప్రకృతి అంశముకాదు నీవు యింద్రియ అంశము కాదు. నీవు ఏ అంశమూ కాదు నా అంశమే భగవంతుని అంశమని పేరు పెట్టుకొని పశువులవలె మనము ప్రవర్తిస్తే భగవదంశమని యేవిధముగా చెప్పగలవు?

విద్యార్థులారా! మీరు ఆదర్శప్రాయులుగా రూపొందాలి దైవత్వమును అత్యంత సమీపించాలి అదే జీవితముయొక్క గమ్యము. అదే మార్గముయొక్క కీలకము మానవత్వములో అనేకమంది మహనీయులు యీ విధమైన మార్గమును అనుసరించి, ఆచరించి, అందరికి అందించి వెళ్ళిన సూత్రములు యివన్నీ. ఒక చిన్న ఉదాహరణము మానవత్వము లోపల యీ దివ్యత్వము యే రీతిగా వుంటున్నది? ఈనాడు వేదాంత పరిభాషయందు మనము విచారించనప్పటికిని తరచుగా ఆత్మ, ఆత్మ అనే పదము వస్తున్నాది. ఈ ఆత్మ అనేది మానవుని యందు యేరీతిగా వుంటుంది? ఐతే మానవునియందు ఆత్మ అహం అనే స్వరూపాన్ని ధరించి వుంది అదే ప్రజ్ఞ అదే ఉనికి ఉనికి అనేది ఎప్పుడూ మారటానికి వీలులేదు జాగ్రత్ స్వప్న సుషుప్తులందు కూడను నేను ఉన్నాను అనే ఉనికి అక్కడ వుంటుంది దీనినే అస్తి, భాతి, ప్రియం అన్నారు సంస్కృతమునందు సత్, చిత్, ఆనందము అన్నారు అస్తి యీ టంబర్లు యిక్కడ వుంది వున్నది being ఇది ఏరీతిగా చెప్పగలుగుతున్నావు? ప్రకాశము మనకు కనుపిస్తున్నాది ఆ టంబర్ అక్కడఉండిపట్లుగా ఈ ప్రకాశము అక్కడ విరూపిస్తున్నది ఇదే టంబ్లరు చీకటిలో కనుపించదు చీకటిలో యీ టంబ్లరు వున్నదని ఎవరు చెప్పగలరు? వెలుతురు యందు మాత్రమే యిక్కడ వున్నదని చెప్పగలుగుతున్నాము. ఐతే వున్నదని చెప్పగలటానికి ఏది ఆధారము? వెలుగే ఆధారము వెలుగు వుండటంచేతనే వున్నదని మనం నిరూపిస్తున్నాము. కనుక వెలుగు ఆధారముచేత వస్తువుయొక్క స్థిరత్వాన్ని నిర్ణయిస్తున్నాము నిర్ణయించిన తరువాత ఏ సందేహములేదు. నిస్సందేహముగా వుంటాము. ఉన్నదని చెప్పే అవకాశము నిరూపించినప్పుడే మనకు తృప్తి కలుగుతున్నాది. ఉన్నది సత్ చూపించేది చిత్. ఈ రెండింటి వలన కలిగే తృప్తే ఆనందము. ఇది నిత్యజీవితములో సత్యమైన స్థానాన్ని మనకు బోధిస్తూ వస్తుంది ప్రకాశమే లేకపోతే వున్నది అన్న పదమే అక్కడ రాదు ఉన్నది అనేదే మనకు తెలియకపోతే మనకు తృప్తి కలుగదు కనుక తృప్తియే ఆనందము ప్రకాశింపచేసేదే చిత్. దేనిని ప్రకాశింపచేస్తున్నది? ఉన్నదానిని ప్రకాశింప చేస్తున్నది లేనిదానిని కాదు అదే సత్, అస్తి ప్రకాశముచేత భాతి రెండింటియొక్క ఏకత్వమే ప్రీతి. అస్తి. భాతి. ప్రియం. ఈ చేతిలో

చక్కెర పెట్టుకున్నాం ఈ చేతిలో నీరు పట్టుకున్నాం. నీరు నీరుగా వుంటున్నది చక్కెర చక్కెరగా వుంటున్నది మీరు ఏమని చెప్పగలరు? యిది చక్కెర యిది నీరు అని చెప్పగలరు ఐతే రెండింటిని చేర్చినప్పుడు నీరు పోయింది చక్కెర పోయింది సిరప్ తయారైంది కాబట్టి సత్ అనే చక్కెర చిత్ అనే నీరుతో చేరినప్పుడు ఆనందమనే సిరప్‌గా తయారౌతున్నది. ఈ మూడూ మానవునియందే వుంటున్నవి కనుక మానవత్వమనగా సత్, చిత్, ఆనందముతో కూడినటువంటిది

ఐతే యీనాడు యీ పాండిత్యమనేది సరైన పిల్లల స్థాయికి దిగివచ్చి బోధించే అవకాశము రాలేదు ఈ పండితులు, మేధావులు, విద్యావంతులు కేవలము పైసా దగ్గరకు ప్రయాణము చేస్తున్నారు కానీ భగవంతుని పాదముల దగ్గరకు ప్రయాణం చేయటంలేదు కనుక వీరందరు బాహ్యమైన అభివృద్ధి కోసం పాటుపడుతున్నారు ఈ విద్యలన్నీ కేవలం ప్రాకృతిమయిన జీవితముకోసమే ప్రాకులాడుతున్నాయి. ప్రాకృత జీవితముకూడను కావాలి. ఐతే ప్రాకృతముతోబాటు పరార్థముకూడను వుంటుండాలి కరెంటు వుంటున్నాది కానీ చెడిపోయిన బల్బు పెట్టుకున్నాము లైటు ఎట్లా వస్తుంది రాదు. రాదు బల్బును మార్చుకోవాలి అదే విధముగా మనయందు దివ్యమైన ఆత్మతత్త్వమువుంది మన బుద్ధి వక్రమార్గము పట్టి వికృత స్వరూపమును పురస్కరించుకొని యీ వెలుగును పోగొట్టుకుంటున్నాది. మన బుద్ధియే బల్బు, దివ్యమైన శక్తియే కరెంటు ఈ రెండింటి లోపల సన్నిహిత సంబంధము వుంటున్నాది కానీ ప్రాకృతమైన విషయములలో ప్రవేశించటంచేత యీ యొక్క ప్రకాశమును మనం పొందలేకపోతున్నాము Magnet Powerful గానే వుంటున్నాది కానీ యినుము తుప్పుపట్టింది. తుప్పుపట్టిన యినుమును అయస్కాంతం ఎలా ఆకర్షించగలదు? తనలోవున్న తుప్పును తాను గుర్తించుకొనలేక యినుము magnetలో power లేదని అంటున్నాది కాదు కాదు. పిచ్చి Iron నీలో dust, rust అధికముగా వుంటున్నాది. దానిని శుభ్రము చేసుకో. తక్షణం నా దగ్గరకు వస్తావు. నిజంగా ఏ శక్తిలేని ఇనుముకు కదలి పరుగెత్తే శక్తి ఎక్కడనుండి వచ్చింది? ఈ magnet power గాని Iron Power కాదు. కనుక ఆ దివ్యమైన ప్రేమ తత్త్వమే అన్నింటిని ఆకర్షిస్తున్నాది. ఇప్పుడు యిన్ని దేశాల వారంతా వస్తున్నారు ఎందుకోసం వస్తున్నారు వారు. ప్రేమతత్త్వమే దీనికి ప్రధానమైన శక్తి

ఒకానొక సమయములో త్యాగరాజు అనేక రకములైన కష్టములు అనుభవించాడు తన ఆరాధనా దైవములను రామలక్ష్మణ సీత విగ్రహములను కావేరిలో ముంచివేశాడు అన్న రామదర్శనము లేక క్షణమైనా వుండేవాడు కాదు త్యాగరాజు కానీ అది కూడను త్యాగరాజు యొక్క లోపమే సర్వత్రా వుండిన భగవంతుడు అయినప్పుడు యీ విగ్రహముపైన తన మనస్సు ఎందుకు యిముడ్చుకోవాలి? ఇది ప్రాకృతమైన అపేక్ష ఈ ప్రాకృతిమైన అపేక్ష వుండటంచేత దుఃఖమునకు గురియైపోతూ వచ్చాడు ఎప్పుడు యీ ప్రాకృతమైన దీనిలో ఆరాధన సలుపుతూవస్తారో అప్పుడు అన్ని సందేహాలు పుడుతూ వస్తాయి ఎందుకంటే ప్రకృతి స్వభావము యిది సందేహముల పుట్ట. ఈ సందేహములు చీమల పుట్టవలె పుడుతూ వుంటాయి. ఈ చీమల పుట్టల వలె సందేహాలు పుట్టటానికి కారణం ఏమిటి? కోరికలు కూడను చీమల పుట్టల వలె పుడుతూ వుంటాయి కోరికలు పుట్టటం చేతనే సందేహాలు పుట్టూ వుంటాయి ఈ ప్రాకృతమైన వాంఛలు అతికట్టుకొనలేక త్యాగరాజుకు రాములపైన కోపం వచ్చింది. నేను నిరంతరము రామచింతన చేస్తున్నాను నా జీవితములో జాగ్రత్ స్వప్న సుషుప్తులలో రామచింతన మరువలేదు. నా భక్తి నాకు తెలును ఐతే యిప్పుడు నాలో భక్తి లేదా? రామునిలో శక్తిలేదా? నిజంగా రామునిలో యీ శక్తివుంటే యీ భక్తుని యిన్ని బాధలు ఎందుకుపెట్టాలి? సామాన్యమైన మానవులు అనుభ

వించేదే యిదంతా. ఇదే ఒక పెద్ద Foolishness కారణం ఏమిటి ? ఈ ప్రాకృతమునకు, పరర్థమునకు సంబంధము పెట్టకూడదు ప్రాకృతము ప్రాకృతముగానేవుండాలి పరార్థముపరార్థముగానే వుండాలి. దేనిలో పోయిందో దానిలోనే సాధించాలి ఇంటిలో సూదిని పోగొట్టుకొని అమాయకురాలైన ముసలమ్మ బజార్లో లైటు వుందని అక్కడ వెతుకుతోందట ఎందుకు అవ్వా ! యిక్కడ వెతుకుతున్నావని అడిగాడు ఒక విద్యార్థి. 'నాయనా ! సూది పోగొట్టుకున్నాను' అంది ఎక్కడ పోగొట్టుకున్నారు చెప్పండి నేను help చేస్తానన్నాడు విద్యార్థి ! 'నా యింటిలో పోయింది నాయనా' అనింది. 'ఓ పిచ్చి అవ్వా ! ఇంటిలో సూది పోగొట్టుకొని యిక్కడ వెతుకుతే ఎలా దొరుకుతుంది? అన్నాడు 'నాయనా ! యింటిలో వెలుతురులేదు వీధిలో వెలుతురు వుందని యిక్కడ వెతుకుతున్నాను' అంది వెలుతురు వున్నా లేకపోయినా ఎక్కడ పోగొట్టుకున్నామో అక్కడే వెతకాలి. మన హృదయములోపల పోగొట్టుకున్నాము, ఆ ఆనందమనే జ్యోతిని చీకటిగా వుండినా అక్కడే వెతకాలిగానీ బయట వెతికితే ప్రయోజనంలేదు కనుక ప్రాకృతమైన దీనిలోపల ఆ యొక్క ఆనందమును కోల్పోయినాడు త్యాగరాజు కనుక రాములపైన సందేహము కలిగింది రాములకే శక్తిలేదని నిర్ణయించుకున్నాడు నేను పరమభక్తుడను. రామునిలోనే శక్తిలేదు ఇది కలియుగముయొక్క ప్రభావము అన్నింటియందు తానే గొప్ప కావాలిగానీ గొప్ప అయినటువంటి వాడైనాసరే అతనికి యిష్టము లేకపోతే అతను చిన్నవాడే విచారించాడు త్యాగరాజు భక్తితో కనుక విచారించాడు. ఇంత తొందరపాటు నాకు మంచిది కాదు నిజంగా రామునిలో శక్తి లేకపోతే యోచించాడు

కపి వారిధి దాటునా - కలికి రోట గట్టునా
లక్ష్మీదేవి వలచునా — లక్ష్మణుడు కొలచునా
సూక్ష్మ బుద్ధిగల భరతుడు చూచినగాని
మ్రొక్కునా
అబ్బ రామభక్తి ఎంతో గొప్పరా !

మారుతి సాగరాన్ని దాటటానికి ఏమి శక్తివుంది ? ఇతను సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించాడంటే ఆది కపి శక్తికాదు లక్ష్మీదేవి ఎవరు ? ప్రపంచమంతా లక్ష్మీదేవి కోసమని ప్రాకులాడుతున్నారు లక్ష్మీదేవి ప్రపంచమునకే ఒక నాయకత్వము వహించింది అదే వసుధ. ప్రపంచమునకే ఆమె లక్షణకరమైన దేవి. అలాంటి లక్ష్మి నిన్ను వరించిందంటే నీలో శక్తి లేకపోతే ఆమె ఏమైనా వచ్చేటువంటిదా ? నిన్ను యిష్టపడేదా? కాదు కాదు ప్రపంచమే స్వరూపకంగా ధరించిన లక్ష్మి నిన్ను ఆశించిందంటే నీలో ఎంత శక్తివుంది రామా ! లక్ష్మణుడు ఎలాంటివాడు. మహా త్యాగి. తనకు భార్య పిల్లలు రాజ్యము సర్వస్వము వుంటున్నది. తాను అరణ్యములో సంచరించవలసిన నియమము లేదు కానీ రామునిపై వున్న భక్తిచేతనే రాముని వెంట వచ్చాడు అంతేకాదు. యీ లక్ష్మణుని తల్లి ఎలాంటిదో తెలుసునా? 'లక్ష్మణా నీవు రామునితో వెళ్ళు నాయనా !' ఏ తల్లి అయినా అట్లా చెబుతుందా? అదృష్టవంతురాలైన కౌసల్య లోకోద్ధారకుడైన రాముని కన్నది అట్టి లోకోద్ధారకుడైన రామసేవ చేసే నిమిత్తమై నేను ఒక అదృష్టవంతురాలను నిన్ను కన్నాను అతని సేవయే నీకు ప్రధానమయిన సేవ. రాములులేని అయోధ్య అరణ్యమే. రాములువున్న అరణ్యమే అయోధ్య రాముడే నీ తండ్రి సీతయే నీ తల్లి. కాబట్టి వారిరువురిని తల్లితండ్రులుగా భావించి పూజించమని బోధించింది అట్టి తల్లి కుమారుడైన లక్ష్మణుడు అతనికి బుద్ధిలేదా ? రాములను కొలచటానికి రాములలో ఎంత శక్తి వుంటేనో లక్ష్మణుడు తలవంచుతున్నాడు అంతేకాదు భరతుడు ఎలాంటివాడు? భరతుడు మహా పవిత్రస్వరూపుడు. భరతునిది నిష్కామభక్తి ఇతనిది పరోక్షస్వరూపమైన తత్వము

లక్ష్మణుడు ప్రత్యక్షస్వరూపము సాకారమును అనుసరిస్తున్నాడు లక్ష్మణుడు నిరాకారమును అనుసరిస్తున్నాడు భరతుడు ఈవిధంగా వారి శక్తిసామర్థ్యములనంతా విచారణ చేసుకుంటూ అప్పుడు నేను ఎంత తెలివితక్కువవాడను రాములయందే శక్తి వున్నది, నాలోనే భక్తిలేదు. అని నిర్ణయించుకున్నాడు త్యాగరాజు అదేవిధముగనే ఏ అర్జంటైనానుంచో, ఏ ఆస్ట్రేలియానుంచో, ఏ జర్మనీనుంచో, ఏ జపాన్‌నుంచో, వీరందరు పరుగెత్తి పరుగెత్తి వస్తున్నారంటే వీరిని ఆకర్షించే శక్తి ఎక్కడ వుంటున్నాది ? ఆ శక్తియే లేకపోతే వీరందరు ఎందుకు పరుగెత్తి వస్తారు? బెల్లమే లేకపోతే చీమలు ఎందుకు వస్తాయి ? కనుక యీ బెల్లము మాధుర్యమును, బెల్లముయొక్క సత్యతత్త్వమును గుర్తించటానికి ప్రయత్నించాలి

విద్యార్థులారా ! ఈనాడు చీమలందు ఐకమత్యము వుంటున్నాది. ఒక చీమ ఎక్కడైనా చక్కెరను చూచిందంటే నాకు మధురమైన చక్కెర చిక్కిందని మెక్కటానికి ప్రయత్నించదు పరుగెత్తిపోతుంది తిరిగి వెనుకకు. ఆ చీమల పుట్టను తీసుకువచ్చి అందరు చేరి ఐకమత్యముగా భుజిస్తాయి! ఎక్కడైనా మనం మెతుకులు జల్లితే ఒక కాకి చూచిందనుకోండి. అది స్వార్థంగా ఆ మెతుకులు తినటానికి ప్రయత్నించదు. కావ్ ! కావ్ ! అని అరచుకుంటూ అనేక కాకులను పిలచుకొని అన్నీ చేరి భుజిస్తాయి. ఈనాడు కాకులలో ఐకమత్యము వుంది. చీమలలో ఐకమత్యము వుంది మనుష్యులలో మాత్రం ఏకమత్యములేదు. అదే పెద్ద దోషము. ఒకే తల్లి గర్భములో పుట్టిన పుత్రులందుకూడను ఐకమత్యములేదు. ఐకమత్యమే విజయమునకు కారణమవుతుంటి పాండవులు ఐకమత్యముతో వుండటం మూలంగానే దిగ్విజయము సాధిస్తూ వచ్చారు. రామ లక్షణ భరత శత్రుఘ్నులు ఐకమత్యంగా వుండటం చేతనే అన్నివిధాల ఆదర్శప్రాయులుగా రూపొందారు. కానీ వాలి సుగ్రీవులు ఐకమత్యముగా లేకపోవటంచేత అనేక దుఃఖాలకు గురై పోయారు కౌరవులలోకూడను ఐకమత్యంలేక ఛిన్నాభిన్నం అయిపోయారు కనుక ఐకమత్యమే మహాబలము. ఐకమత్యము అభివృద్ధి కావాలి ఈ ఐకమత్యము ఏవిధముగా సంభవిస్తుంది ? అందరియందు వుండిన ఆత్మతత్త్వము ఒక్కటే. కనుక యీనాడు మనము విచారించవలసినది ఏమిటి ? మనము జాతి మత బేధములను యేమాత్రము విచారించకూడదు. మానవులు మానవజాతే కనుక యింకొక దానితో పోల్చటానికి వీలులేదు ప్రపంచానికి ప్రధానమయిన భూతములు ఐదు అవే శబ్దము, గాలి, అగ్ని, నీరు, పృథ్వి ఈ పంచభూతములలో గాలిదే కులము ? నిప్పుదే కులము ? నీరుదే కులము ? పృథ్విదే కులము? నీటిది నీటి కులమే అగ్నిది అగ్నికులమే. శబ్దము శబ్దకులమే. భూమిది భూమికులమే. మానవునిది మానవకులమే ఈ కులము లోపల మరల కుల బేధములెందుకు? ఏకత్వమును మనం చక్కగా గుర్తించినప్పుడు ఎట్టి భావములు మనలో పుట్టవు ఈనాడు Unity లేకపోవటంచేతనే Purity అంతర్థానమయిపోయింది Purity లేకపోవటంచేతనే Divinity అట్టడుగున పడపోతున్నది ఈనాడు unity, purity, divinity మూడు పోయినాయి Community మిగిలిపోయింది ఈ community మిగిలిపోయింది. ఈ community ని పట్టుకొని కలహాలు బయలుదేరుతున్నాయి

విద్యార్థులారా ! మీరందరు భావిభారతోద్ధారకులు కావలసినవారు మీ హృదయాలు విశాలము చేసుకోండి! సంకుచితమైన భావాలకు స్థానము యివ్వకండి ! అందరియందు దివ్యత్వమైన ఆత్మతత్త్వమును విశ్వసించండి! అట్టి ఆత్మతత్త్వము సర్వులయందు వుంటున్నదని భావించండి. అట్టి భావనతోనే మీరు నిత్యజీవితము గడుపుతూరండి క్రమక్రమేణా విస్పందేహముగా మీ సత్యస్వరూపమును మీరు పొందుతారు. సత్యతత్త్వమును అనుభవిస్తారు. సత్యానందమును మీరు

పొందగలుగుతారు. ఆదర్శమైన సత్యాన్ని మీరు అనుభవిస్తారు.

విద్యార్థులారా! ప్రాచీనకాలమునుండి భారత దేశములో అనేకమంది ఆదర్శప్రాయులుగా రూపొందిన మహనీయుల పేర్లు ఎన్నో వుంటున్నవి మనము example కావాలి. ఎలాంటి ఆదర్శము కావాలి? ఉన్నత ఆదర్శము కావాలి అంతేగానీ చెడ్డ ఆదర్శమును యేమాత్రము చూపించకూడదు కానీ మన విద్యార్థులు తప్పక దీనిలో విజయము సాధిస్తారు అని నాకు తెలుసు విద్యార్థులను ఆదర్శముగా తీసుకొని నేను పదిమందికి చెప్పే నిమిత్తమై యింతవరకు చెప్తూ వచ్చానేగానీ విద్యార్థుల పైన నాకెట్టి సందేహములేదు.

ప్రియ విద్యార్థులారా! ఈ Summer Course లోపల ఎన్నో తెలుసుకొనవలసిన విషయాలు తెలుసుకున్నారు కానీ తెలుసుకున్నదానిలో ఏ ఒకటి రెండైనా మీరు ఆచరణలో పెట్టి ఆదర్శ విద్యార్థులు కంది కన్న తల్లి తండ్రులను, జన్మయిచ్చిన దేశానికి సత్కీర్తిని తెండి. అదే శ్రీ రా ము డు చెప్పాడు 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి.' విదేశీ భ్రాంతులనేవి వుండవచ్చును మీరు పోయిరండి. కానీ మన మాతృప్రేమను మాత్రం మరచకూడదు విదేశములు ఎంతో సుఖ సంతోషములతో భోగభాగ్యములతో నిండివున్నాయి కానీ భారత దేశము మాత్రము యేమీ తక్కువకాదు ఇందులో కూడను మీరు ఆశించిన భోగభాగ్యము లున్నాయి. కానీ యీ కలియుగ ప్రభావముచేత యీ ఆధునిక విద్యార్థియొక్క భావములు గుర్తించుకుంటే 'పాచిపోయినా పక్కింటి పప్పు రుచి' అంటారు ఇది ఎప్పుడు పరదానినే ఆశిస్తూ పోతున్నాం ఇంటిలో ఎంత రుచికరంగానో తల్లి వండిపెడితే అవి రుచించవు. కాబట్టి భారత దేశము ఏ విధంగానూ తక్కువైనది కాదు మహాభాగ్య భూమి అన్నపూర్ణాదేవి భోగభాగ్యములకు యేమాత్రము తక్కువలేదుగానీ అట్టి భావముతో అనుభవించే వ్యక్తులు లేరు అట్టి వ్యక్తుల కోసమే భారత దేశము ఆశిస్తున్నది. బయట దేశమునకు పోయి మనము ఎన్ని కష్టములకైనా గురైపోతాముగానీ ఆ కష్టములే మన దేశములో పడటానికి ఒప్పుకోము. తన యింటిలో వడ్డించిన పట్టైనను తాను కడుగడు కానీ విదేశములకు పోతే జేబులో డబ్బు లేకపోతే హోటల్లో ప్లేట్లు కడిగి డబ్బు సంపాయించుకుంటాడు లేక Boot Polish చేసి సంపాయించుకుంటాడు ఆ పనే మన దేశములో ఎందుకు చేయకూడదు? ఎందుకు యీ దురభిమానము? మన దేశానికి సేవచేస్తే తప్పేమిటి? అన్ని దేశములను గౌరవించండి! అన్ని మతములను గౌరవించండి! కానీ అందరికి మనము respect యివ్వవలసిందే కానీ నీ దేశానికి నీవు మొట్టమొదట respect (గౌరవం) యివ్వాలి అదే రాముని చరిత్రయందు ప్రధానమైన సూత్రాన్ని చెప్పాడు రావణుని చంపిన తరువాత విజయమును సాధించిన తరువాత విభీషణుడు, లక్ష్మణుడు, జాంబవంతుడు, సుగ్రీవుడు అందరు కలసి వీరందరు రాముని లంకకు రాజ్యాధిపతిగా చేయాలనుకున్నారు. ఒక్కొక్కరు ఆనందంగా ఏమిటో చెవిలో చెబుతున్నారు. చిరునవ్వుతో అన్నింటికి తల వూపుతున్నాడు. స్వామీ! అయోధ్యలో లేని సిరిసంపదలు లంకలో వుంటున్నాయి. భవనములు సువర్ణమయంగా వుంటున్నాయి స్వర్గాన్నికూడను మరపించేదిగా వుంటున్నది లంక. అయోధ్య కంటే లంక గొప్పదిగా వుంటున్నది ఇక్కడే వుండి లంకను పాలించండి అన్నాడు చక్కగా నవ్వుతూ చెప్పాడు. నీ తల్లి కురూపి కావచ్చు. నీ తల్లి అందవిహీనంగా వుండవచ్చు కానీ ఎవరో అందంగా వుంటున్నాది, ఆరోగ్యంగా వుంటున్నాది అని ఆమెను నా తల్లి అనే అధికారం వుందా? నీ తల్లి కురూపియైనా నీ తల్లి తల్లే ఎవరో అందంగా వుంటున్నారని ఆమెను తల్లి అని పిలవటానికి వీలులేదు లంక గొప్ప సిరిసంపదలతో వుండవచ్చును నాది బీద దేశమైనప్పటికిని నా జన్మ

భూమి కనుక దీనిని నేనెన్నటికీ మరువను అన్నాడు. అలాంటి భావములు విద్యార్థులలో రావాలి.

ఈనాడు జాతీయభావమనేది లేదు. ఇది ఎట్లా వుందంటే చిన్న ఉదాహరణము. ఒకచోట ఒక హోటలు వుంటున్నాది దాని ప్రక్కనే Medical Shop వుంటున్నది ఒకదానికొకటి ప్రక్కప్రక్కనే వుంటున్నాయి ఈ Hotel వాడు serve చేసి చేసి తలనొప్పి వచ్చింది సాయంకాలానికి యీ medical shop వాని దగ్గరకుపోయి నాకు headache గా వుంది సారిడాన్ యివ్వండి అన్నాడు కొంతసేపైన తరువాత medical shop వాడు హోటలుకు పోయాడు సార్ పేషెంటు ఎవరు రాకపోవటంచేత నాకు headache గా వుంటున్నది ఒక cup coffee యివ్వండి అన్నాడు Hotel వానికి headache, medical shop వానికి headache కానీ medical shop వానికి medicine పనిచేయదు హోటల్ వానికి కాఫీ పనిచేయదు కాని headache కి వీని కాఫీ, వాని headache వీని మందు పనిచేస్తుంది అట్లే వుంది యీనాటి విద్యార్థుల పరిస్థితి. దేశములో మన బాధకు పరిహారము గావించే పరిసరాలు, పరికరాలు వుంటున్నాయి అవి వారికి ఏమాత్రం గిట్టవు. బయటకే పోవాలి. యీ వాంఛలు మనం పెట్టుకోకూడదు. మనము ఎంతవరకో అంత వరకు జీవితము ఆదర్శంగా నిరూపించాలి కనుక మీరు ఎక్కువ కోరికలు పెంచుకోకండి

విద్యార్థులారా! Less Luggage more Comfort మనము జీవితములో ఎంత కోరికలు తక్కువగా చేసుకుంటామో అంత ఆనందము మనము అనుభవించ వచ్చును ఈనాడు ఆనందమునకు లోటు కలిగిందంటే ఏమి కారణము? మన కోరికలే కారణము కోరికలు పెరిగిపోవటంచేతనే ఆనందము తరిగిపోతున్నది. మంచిచెడ్డలు see-saw పిల్లలు ఆడతారు చూడండి. ఒకవైపున పైకిపోతే రెండవ వైపున తగ్గిపోతుంది. రెండవ వైపున పైకిపోతే యీ వైపున తగ్గిపోతుంది ఆనందము తగ్గిందంటే కారణం ఏమిటి? Desires (కోరికలు) ఎక్కువైనాయి కనుక యీ desires ను తగ్గించండి ఆనందము పెరిగిపోతుంది విద్యార్థులారా! ఆనందమును పెంచుకునే నిమిత్తమై మన కోరికలు క్రమక్రమేణా తగ్గించుకొని ఇంద్రియనిగ్రహము చేసుకొని తద్వారా మన దేశమునకు, మన సంస్కృతికి తగిన గౌరవ మర్యాదలు నిలుపుతారని నేను ఆశిస్తూ ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను

( ది 1-6-1992 న బృందావన్‌లో భగవాన్ బాబావారు చేసిన దివ్య పరిసంగం నుండి )

## విదురనీతి

"నన్వే సుఖేవై కురుతే ప్రహర్షం
నాన్యస్య దుఃఖే భవతి ప్రహృష్టః
దత్వాన పశ్చాత్కురుతేఽనుతాపం
న కథ్యతే సత్పురుషార్య శీలం"

"ఎవరు తమకు సుఖము కలిగినపుడు ఎక్కువగా సంతోషించడో, ఇతరుల దుఃఖములయందు సంతుష్టుడు కాడో, దానము చేసిన పిమ్మట విచారించడో, అతడు సత్పురుషులలో మంచి నడవడి కలవాడుగా చెప్పబడుచున్నాడు."

# శివశక్తి విభూతి

పునర్వసు

అర్కద్రోణ ప్రభృతి కుసుమైరర్చనంతే విధేయం
ప్రాప్యంతే న స్మరహర ఫలం మోక్ష సామ్రాజ్యలక్ష్మీః
ఏతజ్ఞానన్నపి శివశివ వ్యర్థయన్ కాలయాత్మన్
ఆత్మద్రోహీకరణ వివశోభూయా సాదఃపతాని.

( ప్రజలు వ్యర్థమనుకొనెడి జిల్లేడు, తుమ్మి పుష్పాలను నీవు తీసుకొని శాశ్వతమైన మోక్షసామ్రాజ్య లక్ష్మిని ప్రసాదించుచున్నావు దీనిని తెల్సుకొనలేక వ్యర్థము చేసుకొంటిని )

సామాన్యముగా జనులు అమంగళముగా భావించెడి శవభస్మ, కపాల, అస్థికలు, శ్మశానభూమి మున్నగునవి శైవధర్మమున మంగళప్రదములు. శంకరుడు అనగా సుఖముల నిచ్చువాడు అంతా మంగళప్రదము సుఖమయము అయినపుడే సృష్టిలో సుఖదుఃఖాలకు తావులేకపోవచ్చును. అందుచేతనే సృష్టి స్థితి, లయములనెడు త్రిశక్తులను కైవశము చేసికొనుట ఆ దేవునకు విలాసమయినది.

ఆత్మప్రకాశము కలిగించు దివ్యచిహ్నము లింగము. పంచభూతతత్త్వమైన లింగార్చన శివతత్త్వమునకు ప్రధాన లక్షణము శివుడు పంచబ్రహ్మాత్మకుడుగా పంచముఖేశ్వరుని ఆరాధింతురు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనెడు పంచముఖములు.

ఆయన 8 తనువులు కలవాడు పృథివి, ఆపస్సు (జలము), తేజస్సు, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, సోమయాజి అనువాయన అష్టమూర్తులు.

అందు పృధ్వీమూర్తి భవుడు, జలమూర్తి శర్వుడు, తేజోమూర్తి ఉగ్రుడు, వాయుమూర్తి రుద్రుడు, ఆకాశమూర్తి భీముడు, అర్కమూర్తి ఈశానుడు, సోమమూర్తి మహాదేవుడు, యజ్ఞకరమూర్తి పశుపతి, రుద్రనమక ములో ఏకాదశరుద్రులుగా శివుడు కీర్తింపబడుచున్నాడు అష్టమూర్తులు కాక శిపివిష, కరోర, అఘోరులు కలసి ఏకాదశరుద్రులు.

శివుడు ప్రపంచము సృష్టించుటలో రజోగుణమున భవరూపమున బ్రహ్మగను, ప్రపంచ రక్షణాది కార్యము లందు మృడస్వరూపమున విష్ణువుగనూ తమోగుణమున విలయ కార్యమున హరుడై రుద్రుడుగను, గుణత్రయ రహితమై జ్యోతి స్వరూపమై మాయాతీతమైన మోక్ష స్థానమునందుటకు శివుడుగా నావిర్భవించెను పరమేశ్వరుడు.

ఇక పార్వతి శివునిలోని చిచ్ఛక్తి. పార్వతీ పరమేశ్వరులు జగత్తునకు మాతాపితరులు. శక్తి సమన్వితమయిన మంగళ పదార్థమే సృష్టి. కావున ప్రకృతినుండి పురుషుని, పురుషునినుండి ప్రకృతిగాని వేరుచేయలేము.

" పరస్పర తపస్సంపత్ఫలాయిత పరస్పరౌ" అంటారు. ఒకరి తపస్సుకు సంపదగా వింకొకరిని పొందినారు. అనగా పరస్పరము తపస్సు చేయగా పార్వతికి పరమేశ్వరుడు, పరమేశ్వరునికి పార్వతి, లభించిందట. చంద్ర చంద్రికలవలె శివశక్తులు భేదము లేనివారు.

ఆ పరమాత్మ స్త్రీపురుషస్వరూపుడు. పరమేశ్వరుడు భిన్నమూర్తి ఆయనలో చిచ్ఛక్త్యాత్మకమైన త్రిగుణాత్మక శక్తులు సృష్టి స్థితిలయములందు ప్రవర్తించుచున్నవి ఆ చిచ్ఛక్తి స్త్రీ, శివుడు పురుషుడు వీరే

( తరువాయి 44 వ పేజీలో )

# స్వామీ ఈ దేశాన్ని ఉద్ధరించు!

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

'భారతదేశాన్ని అర్థం చేసుకోదలిస్తే వివేకానందులను అధ్యయనం చేయండి' అన్నారు గురుదేవులైన రవీంద్రకవి

"వివేకానందులు నేటి వారలకేకాక భవిష్యత్తరాల బాలల ఆత్మలో" ఉన్నారు. అని చాటి చెప్పారు అరవిందఘోష్

భారతదేశ సంస్కృతి, సాంప్రదాయం తాత్విక సంపదల సమగ్రరూపం వివేకానందులు

ఆయన వాక్కు స్ఫూర్తివంతం ఆయన భావాలు సముజ్వల ఏకజ్వలం

"స్వామివివేకానందులు ఆనాడు అవతరించక వుండిన భారతదేశానికి స్వాతంత్ర్యం లభించేది కాదు హిందూమత పునరుజ్జీవనం సాధ్యమయ్యేది కాదు. భారతదేశం ఆయన కెంతగానో ఋణపడింది" అన్న రాజాజీ మాటల్లో అతిశయోక్తిలేదు

నిరాశా నిస్పృహలతో, దాస్యశృంఖలాబద్ధమయి నిద్రాణంగావున్న భారతజాతిని, "ఉత్తిష్ఠత, జాగృత ప్రాప్యవరాన్ని బోధత" అన్నశంఖారావంతో సముత్తేజపరచిన విప్లవయోగి వివేకానందులు.

"మన ఆశలకు, ఆశయాలకు, ఆదర్శాలకు, ఆకాంక్షలకు పునరుత్థానం కల్పించి, మనకో వినూత్న శక్తిని ప్రసాదించిన మహాతేజోమూర్తి ఆయన.

'భారతీయత' అని మనం సగర్వంగా చెప్పుకొనే ఆత్మాభిమానాన్ని ప్రేరేపించి మనకో నవ్య పథమును నిర్దేశించిన మహానుభావుడాయన.

"వివేకానందుల వాక్శైలి బిథోవెన్ సంగీతంవలె, విద్యుత్ ప్రసారంవలె అత్యంత ప్రభావ సంపన్నమైనది" అన్నారు రోమారోలా

స్వతంత్ర భారతదేశం భీభత్సంగా, ఘోరంగా పరిణమిస్తుందన్న భవిష్యద్దట్టా' ఆయనకుండినది కాబోలు వికావేనందుల పలుకులలోని ప్రతి అక్షరం అందుకు దర్పణంగా వుంది

"రాజకీయాలతో భారతదేశోద్ధరణ సాధ్యంకాదు మన దేశనాయకులు, మునులు, మహర్షులు" రాజులు కారు.

మానవసేవే మహాపూజ — అదే దైవం. అదే ధర్మం. పల్లెపల్లెకూ వెళ్ళి సేవ చేయండి. త్యాగము, సేవ — ఈ రెండే దేశపురోగతికి సూత్రాలు.

దళితులను, అంటరానివారిని విద్యావంతులను కావించి, వారి వ్యక్తిత్వమును వారికి లభింపచేయాలి. మానవ విలువలకు మించిన సంపదలేదు

అందరికీ సమానావకాశాలు కల్పించాలి ఎవరికీ ప్రత్యేక సౌకర్యాలు వద్దు ప్రజలు తమను తాము ఉద్ధరించుకోవాలి. అది జీవనధర్మం.

భావనకోసం హృదయం, ఆలోచన కోసం మెదడు పని కోసం చేతులు బీదరికం ఎక్కడిది? ఇంద్రియ దౌర్బల్యమే అన్ని దుఃఖాలకు మూలం

మతమౌఢ్యం, రక్తపాతం, దౌర్జన్యం మున్నగునవి అంతమైనపుడే నాగరికత వికసిస్తుంది

లక్షలాది ప్రజలు, అజ్ఞానం, ఆకలి మున్నగు వాటితో అలమటిస్తున్నపుడు, వారిని దోచుకొనటంతో లభించిన ధనంతో చదువుకొని, వారి మేలు కొరకు ఏమీ చేయనివారిని నేను ద్రోహులుగా పరిగణిస్తాను

నేటి మన త్యాగం, శ్రమ రేపటి బలిష్ఠ భారత నిర్మాణానికి నాంది స్వార్థరాహిత్యం ఎంతో లాభదాయకం కాని అందుకు సహనం కావాలి నిస్వార్థ భావమే శ్రేయోమార్గం.

( తరువాయి 44 వ పేజీలో )

పురాణవాణి _ 13

# భక్త సిరియాళుడు

మల్లాప్రగడ శ్రీరంగారావు

పూర్వము చిఱుతొండడు, తిరువెంగనాచి అను దంపతులు శివభక్తి పరాయణులుగా వుండి పరశివుని పరమభక్తితో ఆరాధిస్తూవుండేవారు. వారు కేవలము ఆలయంలో వుండే శివునికి అభిషేకము పూజలు చేయుటయే గాక ప్రతిదినము ఒక వ్యక్తిని ఆహ్వానించి ఆతిధ్యమిచ్చి ఆతడే కన్నులకు కన్పడే ప్రత్యక్ష పరమేశ్వరుడుగా భావించి జంగమ శైవారాధనచేస్తూ వుండేవారు ఒక సంవత్సర కాలము వ్రతదీక్షగా యీ జంగమ శైవపూజ చేయాలని సంకల్పించి భక్తి శ్రద్ధలతో నిత్యమూ తమ యింట శివపూజ పూర్తి గావించుకొని వాకట నిలబడి ఆ సమయానికి కన్పడిన వ్యక్తిని పిలిచి పూజించి షడ్రసోపేతముగ భోజనమందించి, తృప్తిపడిన యాతని పరమశివునిగాభావించి సంతోషపడుతూ వుండేవారు.

ఇలా ఒకరోజు తక్కువగా సంవత్సర కాలము గడచిపోయింది చివరిరోజున ఇంటి ఆరాధన ముగించుకొని జంగమ శివునికై వాకిట నిలబడి నిరీక్షించాడు కాని అపరాహ్ణ కాలమతిక్రమించినా ఆతని కొక్క వ్యక్తికూడా కనబడలేదు. రాజవీధిలోనికి పోయి ఎందరినో ఆహ్వానించాడు ఒక్కరూ రా లే దు. సూర్యాస్తమయం లోగా తన వ్రతదీక్ష పూర్తి కావాలని వాడవాడలా తిరిగి కనబడిన వారినెల్ల ఆతిధ్యానికి రమ్మని ప్రార్థించాడు. అతని భక్తిని పరీక్షించటానికా అన్నట్లు ఒక్క జంగమ దైవము లాకపోవుటచే చాలా చింతించి నేటితో నా వ్రతం సమాప్తి జేసికొని పరశివునికి ప్రీతి కలిగించాలనుకున్నానే నేడొక్కడూ రాలేదేమని ఆలోచించి వెదకుచుండగా ఒక పాడుబడ్డ దేవాలయంలో వృద్ధ దంపతులు కన్పించారు వారిని తమ యింటికి తీసికొనివచ్చి అతిధ్యం స్వీకరించి తమ వ్రతాన్ని పరిపూర్ణం చేయుడని ప్రార్థించాడు.

ఆపుడా వృద్ధుడు చిఱుతొండనితో తన నియమాన్ని నెరవేరిస్తే ఆతిధ్యానికి వస్తానన్నాడు. ఎంతటి కఠిన నియమమైనా పాటిస్తానని మాట తీసికొని ఆ ముదుసలి నీ కుమారుని పరమేశ్వరునికి ఉపహారంగా సమర్పించాలి అందుకంగీకరిస్తే వస్తానన్నాడు. తప్పనిసరిగా మీ కోరిక నెరవేరుస్తానని చిఱుతొండడు వాగ్దానం చేయగా నీ భార్య నడిగి మరీ చెప్పు. తల్లిప్రేమ చాల గొప్పది. కన్నపేగుగా పుట్టిన బిడ్డపై నీకంటే యెక్కువ మమకారం వాత్సల్యం తల్లికి వుంటుంది ఆమె సరేనంటేనే నా నియమం నెరవేర్చుమన్నాడు. ఆతడింటికి వెళ్ళి భార్యతో చెప్పాడు. ఆమె భక్తి భావంతో ఆ వృద్ధ దంపతులు పార్వతీ పరమేశ్వరుల వంటివారు. వారి కోరిక నెరవేర్చడం మన జన్మకు సార్థకం అన్నది.

ఇంతలో ఆ ముదుసలి తోటి స్నేహితులతో ఆటలాడుచున్న చిఱుతొండని కుమారుడైన సిరియాళుని వద్దకువెళ్ళి 'నాయనా ! మీ తండ్రి చాల క్రూరుడు. నిన్ను శివునికి బలి యివ్వటానికి సిద్ధపడుతున్నాడు.

కన్నబిడ్డను చంపే తండ్రి ఎక్కడా వుండడు నీకు అతడు పరమ శత్రువు. ఎప్పటికైనా పారిపోయి నీ ప్రాణాలు దక్కించుకోమని హెచ్చరించాడు ఆ సిరియాళువు స్వామీ ! మీకు నమస్కారం నా జీవితం సార్థకమయ్యే పని మా తండ్రి చేస్తున్నాడని మంచి మాట చెప్పారు శివునికి సమర్పించటంకంటే నా జీవితానికి పరమార్థం ఇంకేముంది ? అని సంతోషంగా చెపితే తన పరీక్షలో ఆ బాలుడుకూడ జయించాడని తెలుసుకొని లోలోన ఆనందించాడా వృద్ధుడు

చిఱుతొండ నంబి తిరిగివచ్చి తన భార్య సమ్మతిని వెల్లడించి తన యింటికి ఆ వృద్ధ దంపతులను తీసికొని వెళ్ళి నేటితో తన వ్రతదీక్ష సఫలమగుచున్నదని సంతోషిస్తూ వారికి అభ్యంగస్నానం చేయించి నూతన వస్త్రాలు బహుకరించి వారి కోరిక మేరకు తన కుమారుడైన సిరియాళుని బలిచేసి ఆ దంపతులను పూజించి ఆతిథ్యమిచ్చాడు

ఆ వృద్ధ దంపతులు ఆరగించబోయేముందు ఆ శివ భక్తుడైన చిఱుతొండని చూచి నీ కుమారుని కూడ మాతోపాటు భోజనానికి రమ్మని పిలు పుత్రుడులేని యింట మేము భోజనం చేయమన్నారు మీ నియమాను సారం శివునికి బలిగా సమర్పించాం కదా స్వామీ ! నా బిడ్డ యెక్కడనుండి రాగలడు ? అరగించి మా వ్రతమును సఫలం చేయండని ప్రార్థించగా ఓ సిరియాళా! రా రా మాతోపాటు శివప్రసాదం అరగించు అని పిలువగానే సిరియాళుడు పరుగునవచ్చి ఆ వృద్ధ దంపతులకు నమస్కరించగా వారు నిజరూపం చూపి నీ భక్తిని పరీక్షించుటకే యీ నాటకమాడితిమి జంగమశైవారాధనలో కృతకృత్యుడనైతివి మీకు శివసాయుజ్యం లభిస్తుందని ఆశీర్వదించి అంతర్ధాన

## శ్వేతాశ్వినులు !

విచ్చుకున్న మల్లెల యూనిఫాం
విస్తరించిన నవ్వుతో ...
ఒక చేత్తో చేదుమాత్రలు తినిపిస్తూ
మరో చేతి వేళ్లతో తీపిగుర్తులు లిఖిస్తూ
రోగికి ఉపశమనం కల్గిస్తుంది
విరక్తి, అసహ్యతా
ఏకోశాన కనిపించవు !
గుండెల్లో అగ్నిగోళాలు రగులుతున్నా
బ్రతుకు గాయాల మరకలు సల్పుతున్నా
సేవాసక్తి సన్నగిల్లదు ;
కొందరు కొంటెతనం వింటిని ఎక్కుపెట్టినా
ఎందరో దుర్వ్యాఖ్యానాల బాంబులు విసిరినా
వ్యాకులం చెందదు
కోపం మండదు
అందుకే నాకు లిల్లీలను, రోజ్‌లను
నైటింగేలులను ఎలా ప్రస్తుతించాలో
తెలియదు
కల్తీలేని ఔదార్య ఆదాయంగా జీవిస్తున్న
సిస్టరు 'చలాక్రీమణు' ల
ఎలా ఆదరించాలో పాలుపోదు !

— యస్. యస్. రెడ్డి

మైనారు. 'హరవిలాస' గ్రంధములోని యీ కథ వలన పరశివ ప్రీతికై ప్రాణాలుకూడ సంతోషంగా సమర్పించాలన్న పరమధర్మాన్ని యీ మహాశివరాత్రి సందర్భంగా మనం గుర్తించి పాటించుట శ్రేయో దాయకము

పశక్తి - విభూతి ( 40 వ పేజీ తరువాయి )

ప్రపంచసృష్టికి మాతాపితరులు "శివుడు విభూతిని మాత్రమే ఆశ్రయించినా, తన్నాశ్రయించిన భక్తులకు అష్టఐశ్వర్యములిచ్చువాడు భార్యకు శరీరమే అర్పించిన వాల్లభ్యం కలవాడైనా యతీశ్వరులు జితేంద్రియత్వమున కులతీతుడు. అట్టి శంకరుడు తామసీ వృత్తినుండి సమ్మార్గా లోకమునకు ప్రవర్తింపచేయుగాక" అని ప్రార్థించాలి.

ఇట్టి శివశక్తులు ఏకమైన పరమేశ్వరుడు అన్యాయము, అధర్మము పెరిగి జనులు మూఢులై, నాస్తికత్వము పెచ్చు పెరుగుచున్నవేళ ఈశ్వరాంబా సుతుడుగా పుట్టవర్ధనిలో ( పుట్టపర్తి ) అవతరించి నేటి ప్రపంచముద్ధరించుటకు వెలసిరి. ఈ అవతారము యొక్క విశిష్టతయే వేరు శివునిగా త్రిపురాసురుని సంహరించి, కృష్ణునిగా కురుక్షేత్ర సంగ్రామము, నరకాసుర సంహారములు చేసి దుష్ట శిక్షణ చేసిన పరమేశ్వరుడు ఆ కాలమందు దుష్టత్వమును ఖండించి సుఖముల నిచ్చిననూ నేడు దుష్టత్వమే పెచ్చుమీరుట వలన దుష్టులను సంహరించక వారిలోని దుష్టత్వమును రూపుమాపి సన్మార్గవర్తనులుగా చేయుచున్నారు. అందువల్లనే భగవాన్ బాబా పశుభావమును వీడి పశుపతి భావములు పెంపొందించుకొనుడు అని చెపుతూ శివ పార్వతి, విఘ్ననాయకులను వసుదైక కుటుంబముగా వర్ణించిరి

స్వామీ! ఈ దేశాన్ని... (41 వ పేజీ తరువాయి)

శ్రద్ధాసక్తులుగల కొందరు మాత్రమే, ఏడాది కాలంలో చేయగల పనిని ఒక జనసమూహం ఒక శతాబ్దిలో చేయజాలదు కార్యదీక్ష అత్యంత ప్రధానం

వేదాంత, తత్త్వ అధ్యయనం ఉన్నతమయిన ఆలోచనతో నిండినది. భారతదేశ గౌరవం, సంస్కృత అధ్యయనం జతగా పెరుగుతాయి

మంచిచేయటమే జీవనం—చెడుచేయటమే మరణం

వివేకానందులు మనలోని అలసత్వాన్ని, బీదరికాన్ని, భావదారిద్ర్యాన్ని పారద్రోలి అంతరంగ దుష్టాంగమును ఖండించమని నాడు చెప్పినా నేడు అంగములోని దుష్టత్వాన్ని రూపుమాపమనుచున్నారు. ఇక ఆయన ప్రసాదించు విభూతి ఎటువంటిది ? అంటే పరమశివుని విభూతి గురించి అంటాడు పుష్పదంతుడు —

శివునకు ప్రియమైనది విభూతి అది పరమేశ్వరుని అష్టైశ్వర్య శక్తికి, అందు అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అను 8 యైశ్వర్యములు జ్ఞాన వైరాగ్యములు యశో ధైర్యములు సర్వజ్ఞత్వము, అధీశ్వరత్వము, పరమేశ్వరుని గుణ సంపద, దివ్యదృష్టి, దివ్యశ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్త విజ్ఞానము, అప్రత్యక్ష విషయజ్ఞానము, వియద్గమన అగయన వ్యూహాలక్షణము గల షడభిజ్ఞత్వమునకు వలసిన ఆరు లక్షణములు ఆ దేవదేవునకు విలాసములు.

బుద్ధి, క్షాంతి, వీర్య, ధ్యాన, జ్ఞాన, శీల, బల, దాన, ఉపేక్ష సిద్ధులనెడి దశబలసిద్ధి ఆయన విశ్వేశ్వరత్వమునకు కారణములైన పరమాణువులు. ఇట్టి దివ్యశక్తి సంపద ఆయనలో అనంతము, అవాఙ్మానస గోచరము అట్టి గుణసంపదాన్వితమై విభూతి శరీరుడు భగవాన్ బాబా.

పరమం పవిత్రం బాబా విభూతిం
పరమం విచిత్రం లీలావిభూతిం
పరమార్థ ఇష్టార్థ మోక్షప్రదాతం
బాబా విభూతిం ఇదమాశ్రయామి ○

పరిశుద్ధం కావిస్తాయి ఆ మహనీయుని దివ్యశక్తిని ఏదో ఒక రాజకీయ పక్షానికో లేదా ఉద్యమానికో సమీకరించటం మూర్ఖత్వం కాక మరేమవుతుంది ?

స్వామి వివేకానందుల సింహగర్జనం జాతిని జాగృతం చేయాలి. అదిగో ఆ చిత్స్వరూపుడు వస్తున్నాడు మనలో స్ఫూర్తిని రేకెత్తిస్తున్నాడు కాని మన వివేకోదయం అవుతుందా ? ఆ మహాత్ముని పలుకులను వినే సంకల్పం వుందా ? ఆచరించే దృఢనిశ్చయం వుందా ? అప్పుడే దేశం పురోగమిస్తుంది వివేకానందుల ఋషివాణిని విస్మరిస్తే సర్వనాశనం తప్పదు. ○

( 10 వ పేజీ తరువాయి )

ఈనాడు Thursday గురువారం అని వచ్చింది క్యాలెండర్‌లో ఇది గురువారం ఎట్లా నమ్ముతున్నావు? నీకు ఎట్లా తెలుసు ఇది గురువారం అని. ఏదో ఒక సిద్ధాంతి వ్రాసిన దానినిబట్టి ఇది గురువారం అని నమ్ముతున్నావు. అంతేకాని ఇది గురువారం అని విశ్వసించటానికి ఆధారములేలేవు దీనికి ఆధారం ఏదో ఒక సిద్ధాంతి దీనిని పట్టుకొని మనం విశ్వసిస్తున్నాము ఈనాడు ఏకాదశి, ఏకాదశి అంటుంటే ఆనాడు వ్రతాన్ని మనం ఆరంభిస్తున్నాం. ఆ ఏకాదశిని మనం క్యాలెండర్ బట్టి విశ్వసించే మనం ఆచరణ లోపల మనం నిమగ్నులవుతున్నాం ఒక సిద్ధాంతి వ్రాసిన దానినే ఇంత విశ్వసిస్తున్నామే. సాక్షాత్ వేదం చెప్పిన 'తత్, త్వం, అసి' "నీవే బ్రహ్మ" అని చెప్పిన దానిని నీవు ఎందుకు విశ్వసించటంలేదు? 'అహం బ్రహ్మాస్మి' నేనే బ్రహ్మ అనే దానిని నీవెందుకు విశ్వసించటం లేదు? కారణం మోహములో మునగటమే. ఒక చిన్న ఉదాహరణము.

తుమ్మెద చాలా బలమైనటువంటిది దాని ముక్కు చాలా సూటు అయినటువంటిది. టేకులాంటి కర్ర నయిననూ తొలచి లోపలకు ప్రవేశిస్తున్నది. అలాంటి బలమైన తుమ్మెద ఒక పుష్పములో ప్రవేశించి ఆ పుష్పము ముకుళించిన తక్షణమే, ఆ మకరందంలో తాను మునిగి తనయొక్క శక్తి తాను మరచి, ఆ లేత రేకులనుకూడా చింపకొని బయటకు రాలేక ప్రాణములను వదలుతుంది కారణం ఏమిటి? అంత శక్తి కలిగిన తుమ్మెద తన శక్తిని తాను మరచిపోతున్నాది కారణం? ఆ పుష్పములో ఉన్న మకరందమనే మోహమే అదేవిధముగా మానవుడు ఈ జగత్తునందు సంసారమనే మోహములో మునిగిపోయి 'అహం బ్రహ్మాస్మి' అనే శక్తిని మరచిపోయి, కేవలం తాను బంధితుడు అవుతున్నాడు. ఆ బంధనలలో మునిగి భయభ్రాంతులకు లోనవుతున్నాడు. కనుక మానవుని దుఃఖములకు, విచారములకు కష్టములకు తన యొక్క వాంఛలే మూలకారణము ఎవరూ దీనికి కర్తలుకారు. ప్రపంచ సంబంధ విషయములలో కర్మకర్త కారణ ముంటుండాలి కాని భగవత్ విషయంలో ఈ కర్మ కర్త కారణములు ఏమాత్రం పనికిరావు వ్యాకరణములో కర్త, కర్మ, క్రియ అంటారు కర్త, కర్మ, క్రియ, అంటే రాముడు కుక్కను చంపినాడు. చంపటము క్రియ రాముడు కుక్కను అని చెబితే ఏమి చేశాడు? అనే ప్రశ్న వస్తుంది క్రియ రావాలి చంపినాడు అని చేరాలి. రాముడు చంపినాడు అని కర్త క్రియ వచ్చినప్పుడు ఇక కర్మ లేకపోతే? రాముడు చంపినాడు దేనిని చంపినాడు? కాబట్టి ఏది లేకపోయినా ప్రశ్న వస్తుంది ప్రాపంచిక వ్యవహారంలో రాముడు కుక్కను చంపినాడు ఈ కర్త, కర్మ, క్రియ ఈ మూడూకూడనూ చేరాలి కాని దైవత్వానికి లేదది. దైవమే కర్త, దైవమే కర్మ, దైవమే కారణం, కనుకనే కర్త కర్మ క్రియ మూడింటి యొక్క తత్త్వము దైవమే. అతనియందు ఈ మూడుకూడనూ ఏమాత్రం విచారించే అధికారమే లేదు ఎవరికి ఎందుకు ఇట్లా చేస్తున్నాడు? నీకేం తెలియదు తనయొక్క కారణం ఏమిటో! కారణాలు తెలుసుకొనే అధికారం నీకులేదు. ఎందుకనగా నీ పాత వాసనలను పురస్కరించుకొని భగవంతుడు కర్మలను ఆచరిస్తుంటారు ఏ విధమైన మంచిమార్గంలో నిన్ను ప్రవేశపెట్టటానికి ఏ విధమైన కర్మలనాచరించుతున్నాడో అది నీకేం తెలుసు? కనుక నీవు ఈ కర్త, కర్మ, క్రియలను విచారించుకోవటానికి నీవు భౌతికజ్ఞానమే కాని ఆధ్యాత్మిక జ్ఞానం కాదు 'ఇలాంటి జ్ఞానం లోపల విద్యార్థులు ప్రవేశించాలి. లౌకికమైన పొట్టకూటి నిమిత్తమై పదార్థజ్ఞానము, విషయ జ్ఞానములను నేర్చుకోవలసిందే. కాని ఆధ్యాత్మిక జ్ఞానము లేకపోతే మానవత్వం వ్యర్థమైపోతుంది.

కనుక ప్రతి దానికి కూడనూ ఒక అధికారము. అధికారమని అధికారములో నీవు ప్రవేశించకూడదు. ఎవ్వరికీ ఈ ప్రపంచములో అధికారమేలేదు. నాకు అధికారం ఉన్నదనే అహంకారం కేవలం మానసిక వికారమే. ఈ మనోవికారం చేతనే మానవుడు తన ఆకారతత్త్వాన్ని కూడనూ విస్మరిస్తున్నాడు కర్తవ్యమే నీకున్నది. అదే నిజమైన యోగం 'కర్మణ్యే వాధికారస్తే' కర్మను ఆచరించటమే నీ అధికారము. అదే 'కర్తవ్యం యోగముచ్యతే' దానిని ఆచరించటానికి శక్తిసామర్ధ్యాలు లేని బలహీనుడవు. నీవు కర్మఫలితములను ఏరీతిగా ఆశించగలవు? కర్మను ఆచరించినప్పుడే కర్మఫలితం మనకు లభ్యమవుతుంది. కర్మలే ఆచరించక ఫలం ఏరీతిగా లభ్యమవుతుంది? తట్టలోని పదార్ధం పొట్టలో చేరాలంటే నోటికి చేతికి పని పెట్టాలి అట్లా కాకుండా నాకు అన్నం తినే అధికారముంటుండాది అని తట్టలోని పదార్థముల పేర్లు చెబుతుంటే పొట్ట నిండుతుందా? కాదు తట్టలోని పదార్థములను పొట్టలో నిండాలంటే నీకు నోరు చెయ్యి ఇచ్చాడు భగవంతుడు ఈ రెండింటికీ తగిన పనిపెట్టు అదే నీ కర్తవ్యం. ఈనాడు మానవుడు ఎన్నో ఆలోచిస్తున్నాడు. ఎన్నియో నా స్వయంకృషిచేత నేను సాధిస్తున్నానని అహంకారముతో విర్రవీగుతున్నాడు. ఇది కేవలం వెర్రితనం ఎన్ని ప్రయత్నములు చేసినప్పటికినీ విఫలమయ్యే కార్యములు ఎన్ని కన్పించటం లేదు? ఈ ప్రపంచంలో ఏ కర్మలు ఆచరించనప్పటికినీ ఫలమయ్యేటటువంటి ఫలితములు ఎన్ని కన్పించడం లేదు? ఈ ప్రపంచంలో మానవుడు కేవలం ఒక భ్రాంతిచేత నేను ఇది చేయాలి, అది చేయాలి అని భ్రమిస్తున్నాడే కాని ఆ ఫలితం తన చేతిలోలేదు.

" యత్న ప్రయత్నములు మానవధర్మము
జయాపజయములు దైవాధీనము "

ఈ ప్రయత్నములో సఫలమయ్యేవి ఎన్నో మన జీవితంలో అనుభవిస్తున్నాం ఒక చిన్న ఉదాహరణము. నీకు ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుగుతున్నాయి దీనికి నీవు ఏ ప్రయత్నము చేస్తున్నావు? నీవు నిద్రిస్తున్నా ఉచ్ఛ్వాస నిశ్వాసములు సహజంగానే జరుగుతున్నాయి. నీవు కోపంతో ఉన్నా ఉచ్ఛ్వాస నిశ్వాసములు సహజంగానే జరుగుతున్నాయి. నీవు ఆనందంతో మైమరచినప్పటకీ నీ ఉచ్ఛ్వాస నిశ్వాసములు సహజంగానే జరుగుతున్నాయి ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసములకు నీవు ఏవిధమైన ప్రయత్నం చేస్తున్నావు? సహజంగా జరిగిపోతున్నాయి కదా! ఇదియే భగవంతుని యొక్క సంకల్పం ఇంతియేకాదు నీయొక్క గుండె కొట్టుకుంటున్నాది. ఈ గుండె కొట్టుకోవటానికి నీవు ఏ ప్రయత్నం చేస్తున్నావు? ఇది సహజంగా తనయొక్క పని తాను చేస్తుండాలి. కాని ఆ యొక్క నిర్ణయం ఏనాడు అణగిపోతుందో! అది ఆనాడు అణగిపోతుంది. దీనిపైన నీ నిర్ణయాలు లేవు అన్నం పొట్టలోకి వేస్తున్నాం, నీవు చేసే ప్రయత్నం చేస్తున్నావు కాని, పొట్టలో పోయిన దానిని ఏది జీర్ణింప చేస్తుండాలి? ఎంత కసరత్తు చేసినా అరగనివాళ్ళు ఎంతమంది లేరు? ఏ కసరత్తు లేకుండా కేవలం Loding Unloding చేసికొనే జీవులెన్ని లేవు? కాబట్టి అవి సహజంగా జరిగేటటువంటివి. మానవుని ప్రయత్నంతో లభ్యమయ్యేవి కావు. మన దేహం లోపల రక్తప్రసరణ జరుగుతున్నది ఇది సహజంగా జరుగుతుండాలి. దీనికి ఏ ప్రయత్నము చేస్తున్నాడు మానవుడు? ప్రయత్నంతో ఫలించేదయితే మానవుడు బ్రతకాలంటే బ్రతుకుతున్నాడా? ఏ చక్రవర్తి అయినాసరే తాను బ్రతకాలని ఆశిస్తాడు తాను బ్రతుకుతున్నాడా? ఇది ఎవరి చేతిలోలేదు కాబట్టి ఆశించినది ఫలించటము ఇది అసాధ్యము పోనీ చావాలంటే చస్తున్నాడా మానవుడు? ఆ చస్తున్నాడు ఏ రైలు క్రిందపడో, యాక్సిడెంట్‌లోనో చస్తున్నాడంటారు. కాని ఇది చావు కాదు, ఇది యాక్సిడెంట్ అనుకొన్నప్పుడు చచ్చేది ఎవరికన్నా జరుగుతుండాలా? ఇదంతా దైవసంకల్పమే. అనుకున్నది జరగాలంటే ఇది దైవసంకల్పమే కాని మానవ సంకల్పం కాదు అయితే మానవుడు నిమిత్తమాత్రంగా తాను కొంతవరకు ప్రయత్నించాలి.

' నిమిత్తమాత్రం భవసవ్యసాచి ' ఓ అర్జునా ! నీవు నిమిత్తమాత్రంగా నిల్చొ ! నేనంతా చేస్తాను ఈ భగవద్గీతను దేశానికి అందిస్తానన్నాడు కాని ఆ అర్జునుడు కూడనూ గొప్ప తెలివితేటలు కలవాడు తాను గొప్ప విద్యావంతుడనని విర్రవీగాడు శక్తి సామర్థ్యములు కలవాడని అహంకారపడ్డాడు తన తుచ్ఛమైన, సంకుచితమైన తెలివితేటలను ప్రవేశ పెట్టాడు. ఎన్నెన్నో ప్రశ్నలు వేశాడు అర్జునుడు కృష్ణుని కాని వేసేంతవరకు మెదలకుండా ఉన్నాడు కృష్ణుడు అర్జునా ! ఇంకా ఏమేమి అడుగు తావో అడుగు, అన్నాడు **అడిగాడు, అడిగాడు.** అడిగాడు. **1 1/2 అధ్యాయములు అర్జునుని ప్రశ్నలే.** స్టాకు చేసుకున్న సరుకంతా అయిపోయింది ఇంక అర్జునునిలో ఏ శక్తిసామర్థ్యములు లేవు అణిగి పోయాడు ఏం అర్జునా ! ఊరుకున్నావేమి ? ఏమైనా అడుగు ఇంక నాకు చేతకాదు స్వామీ ! అన్నాడు. " ఇక నేను చెబుతాను విను " అన్నాడు కృష్ణుడు. అప్పుడు 'కరిష్యే వచనం తవ' నీ ఆజ్ఞను నేను శిరసా వహిస్తానన్నాడు అర్జునుడు మానవుడు తనలో ఏదో శక్తి ఉన్నదని విర్రవీగి వెర్రి మాటలచేత తన జీవితమును నాశనం గావించుకుంటున్నాడు పవిత్రమైన వాటిని చేతులారా వెనక్కి నెట్టుకుంటున్నాడు. చిక్కినటువంటి దానిని దూరం చేసుకుంటున్నాడు దీనికంతా ప్రారబ్ధం మూలకారణం చిక్కటము అతని ప్రయత్నం కాదు కాని చిక్కటం భగవంతుని యొక్క అనుగ్రహం. కాని నాశనం చేసుకోవడం అతనియొక్క ప్రయత్నం ఒక చిన్న ఉదాహరణ ఒక పెసరగింజ ఉంటున్నాది ఇది ఎప్పుడు పుట్టింది ? దీనికి తండ్రి ఎవరు ? దీనికి తాతలెవ్వరు ? దీనికి అవ్వలు ఎవరు ? దీనికి ముత్తాతలు ఎవరు ? ఎక్కడ పుట్టింది ? దీనిని ఎవ్వరూ చెప్పడానికి వీలుకాదు కాని పుట్టుపూర్వోత్తరము ఎవ్వరూ విచారించలేరు కాని దాని అంత్యము మాత్రము మన చేతిలో ఉంటుంది ఏమిటి ఈ అంత్యము ? ఆ పెసరగింజను నోట్లో వేసుకొని నమిలివేస్తే దాని అంత్యము అయిపోయింది. దానికి పుట్టుకను మాత్రం ఎవరూ చెప్పలేరుగాని, దాని అంత్యము మాత్రము మన చేతిలోనే ఉంటుంది అందుకోసమనే అంత్యమునకు నీవు సరియైన ప్రయత్నములు చేయమని చెప్పాడు భగవంతుడు. "పునరపి జననమ్" నకు ఏమాత్రం ప్రయత్నించవద్దు అది నీ చేతిలో లేదు అంత్యము మాత్రము పవిత్రమైనదిగా కావడానికి నీవు ప్రయత్నం చేయి అదియే సాధనఅన్నారు. సాధన అంటే ఏమిటి ? నిజంగా భగవంతుని అన్వేషణ సాధన అని అనుకుంటున్నావు భగవత్ అన్వేషణ చేయనక్కర్లేదు ఇది కేవలము అజ్ఞానమే భగవంతుడు ఎక్కడ ఉన్నాడని నీవు అన్వేషణ చేస్తున్నావు ? **'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణః'** అన్నది వేదం అనగా లోపల వెలుపల సర్వత్రా నారాయణతత్త్వమే వ్యాపించి ఉన్నది.

అనాత్మను విసర్జించాలి ఆత్మను స్వీకరించాలి. ఇదియే సరియైన సాధన. అంతియే కాని జపమో, ధ్యానమో, యోగమో ఇవన్నీ Time Waste ఎవరు చేస్తున్నారు నిజంగా జపం? ఎవ్వరూ సరిగ్గా చేయటం లేదు జపమాల తిరుగుతుంటుంది కాని, మనస్సు నిలుస్తుందా ! ఒకవైపు జపమాల వ్రేళ్ళ అంతా త్రిప్పుకుంటూ వంటింట్లో వాసన చూసి, పరుగెత్తిపోతున్నాడు దానిని మూసివేయడానికి ఇక ధ్యానం చేస్తున్నాడు. ఏమి ధ్యానం చేస్తున్నాడు ? దైవాన్ని కాదు ఇంటిలోని విషయాలంతా ధ్యానం చేస్తుంటాడు. ఈ కొడుకులు, బిడ్డలు, అల్లుళ్ళు, కోడళ్ళు వీళ్ళనంతా ధ్యానం చేస్తుంటాడు రేపు ఏం పని చేయాలి ? అని ధ్యానం చేస్తుంటాడు ఇవన్నీ ధ్యానాలు. కాదు...కాదు...మనం చేయవల్సినది పవిత్రమైన చింతన? ఏ పని చేసినా దైవమే " విశ్వం విష్ణుమయం జగత్ " అంతా భగవంతుని యొక్క స్వరూపమే. ఆ భావంతో నీవు చేస్తే, ఎంతో ఆనందాన్ని అనుభవిస్తావు ఈ చదువులు అంతాకూడనూ ఒక విధమైన జీవనోపాధి నిమిత్తం ఏర్పడినవే ఆట పాటలు కూడనూ మన ఆరోగ్య ఆనంద నిమిత్తమై ఏర్పడినటువంటివేననే లక్ష్యాన్ని మాత్రం మీరు స్థిరం చేసుకోండి.

జీవనోపాధి అవసరమే కాని జీవితపరమావధి కూడనూ చాలా అవసరం పరమావధే లేకపోతే జీవితానికి అవసరమేమిఉంటుంది. కనుక విద్యార్థులు మీ చదువులతోపాటు సంస్కారాన్ని కూడా పెంచుకోవడానికి ప్రయత్నించాలి.

పిల్లలు ఏదో జనవరి 11వతేదీ మాత్రమే ఈఆటలు ప్రారంభం అని మీరనుకోకూడదు. జీవితమంతా ఒక Sports day యే. Life is a game play it. మన జీవితమే ఒక ఆట ప్రతి ఆట కూడనూ మనం ideal గా ఉండేటట్లు చూసుకోవాలి. అప్పుడే మీరు ఎక్కడికి పోయినప్పటికీ మీ ideals ఇతరులు కూడనూ అనుసరిస్తారు క్రమశిక్షణ ఎలాంటిదో మీరు చక్కగా అర్థం చేసుకోవాలి. క్రమశిక్షణ మన institute లో ఉన్నంతవరకు hostel లో ఉన్నంతవరకు కాదు క్రమశిక్షణ మన Shadow ( నీడ ) వంటిది నీవు ఎక్కడకి పోయినా నీ shadow (నీడ) నిన్ను వెంటాడుతుంది. నీ చదువు అయిపోయిన తర్వాత కూడను, స్వస్థానం చేరిన తర్వాత కూడనూ, ఆఫీసులో ఉద్యోగం చేసినపుడు కూడనూ ఈ క్రమశిక్షణ ఉంటుండాలి ఎటువంటి ప్రమాదం రాకుండా మనం జాగ్రత్తగా చూచుకోవాలి. కనుక Smoothగా, ఆకర్షణీయంగా, ఆనందమయంగా ఉండే games ను మీరు అభివృద్ధి పర్చుకోవాలి.కాని భక్తిశ్రద్ధలుండిన వారికి ఏ ప్రమాదములు జరిగినా కూడనూ ఏ విధమైన కీడూ జరుగదు. స్వామి దయ ఉంది. మీ భక్తి కూడా ఉండాలి. ఒక పిల్లవాడు పైనుండిపడ్డాడు. ఎట్లా పడ్డాడు ? తలక్రిందులుగా పడ్డాడు. డాక్టర్లు అంతా కూడనూ ఇది చాలా ప్రమాదం బెంగుళూరు తీసుకొనివెళ్ళాలి అన్నారు. కాని ఆ పిల్లవానికి ఏమీ జరుగలేదు. త్వరలోనే నయమైపోతుందని నేను చెప్పాను. ఆ పిల్లవానికి కూడా మంచి భక్తి. అతను ఏ కట్టు కట్టుకోలేదు. ఏమి చేయలేదు. Boy ! quick comeon ! అన్నాను. వచ్చాడు కాలు విరిగింది అన్నారు అందరు. కాని ఈ అబ్బాయి ఎట్లా వచ్చాడు ? ఆ భక్తి ఆ విశ్వాసమే మూలకారణం.

కనుక భక్తిశ్రద్ధలుంటుంటే ప్రమాదాలు కూడా తప్పుతుంటాయి ప్రమాదాలు ఒక్కరికే వచ్చేటటువంటివి కావు కొండలువలె ప్రమాదాలు వచ్చినా మంచువలె మాయం చేయవచ్చును. భగవదనుగ్రహం కనుక ఉంటే అట్లా అని మనం ప్రమాదానికి గురికాకూడదు. మన జాగ్రత్త మనం చేసుకోవాలి. ఆ విధమైనటువంటి సాధనాలు చేసే సమయంలో క్రింద దానికి తగిన బందోబస్తులు కూడా చేయాలి. మెత్తని పదార్థాలు క్రింద పెట్టుకోవాలి. ఏ నిమిషంలో ఎట్లు జరుగుతుందో, ఎవరికి తెలియదు. కనుక ఈ ఆటల నిర్వాహకులు కూడా ఏర్పాట్ల విషయంలో కొంత జాగ్రత్తగా ఉంటుండాలి. మీరు కూడా చాలా ఉత్సాహంతో ఆనందమయమైన దానిని పదిమందికీ అందిస్తూవచ్చారు. కాని మధ్యమధ్య ఇలాంటి బాధను కూడా కలిగిస్తూవచ్చారు ముమ్ముందు అలాంటి బాధలు కల్గించకుండా చూచుకోండి ప్రమాదములకు అవకాశం యివ్వకుండా చూచుకొనేటటువంటి ఆటలు ఆడాలి మన ఇన్‌స్టిట్యూట్‌లో అనేకమంది బీదపిల్లలు కూడా చేరుతుంటారు, దురదృష్టవశాత్తు ఏదైనా ప్రమాదం ఎవరికైనా సంభవిస్తే వెంటనే టాక్సీ పెట్టుకొని వెళ్ళవలసివస్తుంది. కనుక అలాంటి లోటు లేకుండే నిమిత్తమై అన్ని హాస్టల్స్‌వారికి విడివిడిగా నాలుగు డీజల్ చిన్న కార్లు ప్రెజంటేషన్‌గా యిస్తున్నాను. వీటిని జాగ్రత్తగా ఉపయోగించుకోవాలి. వార్డెన్స్,ప్రిన్సిపాల్స్ వీటిని బాధ్యతగా వినియోగించాలి. చిన్నచిన్న పిల్లలకు డ్రయివింగ్ చేయటానికి ఇవ్వకూడదు. వాళ్ళకూ ప్రమాదమే. కారుకూ ప్రమాదమే. కారుకు ప్రమాదమయినా నేను యోచించను గాని పిల్లలకు మాత్రం ప్రమాదం జరుగకూడదు. ఆటల లోపల ముఖ్యమైనది ఏమిటంటే మీ అనుకూలాలకు తగినట్లు.చేయటమే. ఈవిధంగా మీరు సుఖంగా, ఆనందంగా, అనేకవిధములైన ప్రదర్శనలు చేసి ప్రపంచానికి చూపి, ఆనందంగా ఉండి మీ తల్లిదండ్రులను కూడా ఆనందపరచి, ఎట్టి ప్రమాదాలకు లోను కాకుండా జాగ్రత్తగా చూచుకోవాలని కోరుతూ, ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నేను ప్రసంగాన్ని విరమిస్తున్నాను. ○